కవిత:

# తరగతి గది నా తుపాకి !

తరగతి గది నా తుపాకి!
తరగతి గది నా ఎ.కె. 47 రైఫిల్!!
తరగతి గది నా ఆలోచనల గని
తరగతి గది నా ఆచరణల ధ్వని!
అక్కడ నేను అర్థం పర్థం లేని పాఠాల తోలు వలచి
నా విద్యార్థుల మెదళ్ళలో ప్రశ్నల కొడవళ్ళు మొలిపిస్తాను!
అక్కడ నేను అశాస్త్రీయ విశ్లేషణల చట్రాలు బస్తీల బజారుకీడ్చి
హేతుబద్ధ వాదనల కత్తులు ఝళిపిస్తాను!
విషసంస్కృతి విషవలయంలో గిరికీలు కొడుతున్న
రేపటి పౌరులలో ప్రజాసంస్కృతి దీపాలు నాటి
పోరాట యోధులుగా మలుస్తాను.

నా తరగతి గది నా ఆయుధం
నాకు అక్కర్లేదు
చైతన్య, విజయ ప్రచార రథాలు
నాకు వద్దనే వద్దు
ఆడియోలూ, వీడియోలూ, మైకులూ, వేదికలూ
నాకు అసలు వద్దు
రేడియోలూ, దూరదర్శన్‌లూ
పత్రికలూ సుతరామూ అక్కర్లేదు
నాకు నా తరగతి గది చాలురా నాయనా
అదే నాకు గొప్ప ప్రచార సాధనం
నా పిల్లల మెదళ్ళకు పట్టించిన చిలుం వదిలించడానికి
నా పిల్లల మెదళ్ళలోని సాలెగూళ్ళని తెంచివేయడానికి
నా వేలాది పిల్లల మానసికారోగ్య రక్షణకు
పనికి వచ్చే చికిత్సాలయం నా తరగతి గది
అవును
తరగతి గదులే మన ప్రచార సాధనాలు కావాలి
అవి మన చేతిలో వున్న పదునైన ఆయుధాలు
అక్కడే మస్తిష్కాలకు మెరుగులు దిద్దుదాం
ఉత్తమ విలువలను మొలిపిద్దాం.
నిజమైన ఉపాధ్యాయులుగా కృషి చేద్దాం.




సంపుటి : 15 సంచిక : 10
జూలై 1992

రచనలు పంపవలసిన చిరునామా
మార్పు గమనించండి :
నిర్మలానంద వర్కింగ్ ఎడిటర్
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావు పేట,
విజయవాడ - 520 002.

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్ :
మేనేజర్, ప్రజాసాహితి
29-28-67, దాసరివారి వీధి,
సూర్యారావు పేట,
విజయవాడ-520 002.

ఇతర వివరాలకు :
కొత్తపల్లి రవిబాబు ప్రధానకార్యదర్శి
జనసాహితీ, నగరం-522 268.

వెల : రూ. 5 సం॥ చందా రూ. 50



ముఖచిత్రం :
రచయితల, శిల్పాకారుల ఐక్యతా
సదస్సు సంరంభం



ముఖచిత్ర అలంకరణ :
రాంబాబు



రెండవ కవరుపేజీ :
తరగతిగది నా తుపాకీ (కవిత)
— కొత్తపల్లి రవిబాబు

మూడవ కవరు పేజీ :
ఎలక్ట్రీ (కవిత)
— అణుకుమార్

నాలుగవ కవరు పేజీ
సాక్ష్యం (కవిత)
— దర్భశయనం శ్రీనివాసాచార్య

## ఇందులో...

# ఐక్యతా సదస్సు విజయవంతం కావాలని కాంక్షిస్తూ వచ్చిన సందేశాలు

వి. ఆర్. కృష్ణయ్యర్, ఫోను నెం. 36088,
సుప్రీమ్ కోర్టు మాజీ జడ్జి.

సద్గమయ, యం. జి. రోడ్, ఎర్నాకులం,
కొచ్చిన్-682 011 (కేరళ)

ప్రియమైన నిర్మలానంద,

నాకు "ప్రజాసాహితి" (జనసాహితి) తో గాని, "అరుణోదయ"తో గాని అంత పెద్దగా పరిచయం లేదు. అయినా, (రెండు సంస్థల్ని) ఏకం చేసి బలమయిన విప్లవాత్మక ఆయుధంగా 'జనసాహితి'ని రూపొందించే మంచి ప్రయత్నం అభినందించ దగ్గది. వాస్తవానికి మన దేశంలో అభ్యుదయ శక్తులు ముక్కలు చెక్కలైన కారణం చేత ఎన్నో అడ్డంకుల్ని ఎదుర్కొంటున్నాయి. అందుచేత ఐక్యం కోసం చేసే ప్రతి ప్రయత్నమూ ఒక ముందడుగే. కాని ఒక ముఖ్యమైన విషయం మీరు ఎప్పుడూ గమనంలో వుంచుకోవాలి. అది - మనం ప్రజల కోసం పోరాడాలి, పోరాటంలో అపజయం పొందినా మనం ప్రజల పక్షమే వహించాలి. ప్రజాతంత్ర ఉద్యమాలను సంఘటితపరుస్తూ పోవాలి. నూతనంగా ఏర్పడిన "జనసాహితి", ప్రజాతంత్ర పోరాట (**people's democracy**) దిశగా ముందుకు సాగిపోతుందని ఆశిస్తున్నాను. నా అభినందనలనూ, శుభాకాంక్షల్నీ తెలియజేస్తున్నాను.

27 జూన్ 1992.

ఇట్లు, విధేయుడు,
వి. ఆర్. కృష్ణయ్యర్.

ఎ. ఎన్. నాగేశ్వరరావు, ఎం.ఎ. 26-6-92
C/o ఆంధ్రా బ్యాంక్, కలకడ-517 236.

ఆత్మీయులు నిర్మలానంద గారూ,

నమస్తే. ఆదరంతో మీరు పంపిన 'జనసాహితి, అరుణోదయ (అరుణోదయ ఆర్గనైజింగ్ కమిటి) ఐక్యతా సదస్సు' ఆహ్వానం అందింది. చాలా సంతోషం, కృతజ్ఞతలు.

దిగజారుతున్న సాహిత్య, సాంస్కృతిక వాతావరణంలో మార్పును, వెలుగును నింపడానికి పై సంస్థలు విడిగా ఎంతో కృషి చేస్తూ వస్తున్నాయి. నేడు అవి రెట్టించిన శక్తితో, ఉత్సాహంతో పని చేయడానికి ఐక్యమవుతాయని తెలిసి ఉత్సాహపడుతున్నాను. సంఘాల మధ్య సున్నితమైన (పనికి సంబంధించి) సమ

(తరువాయి 77 వ పేజీలో)

## సంపాదకీయం - 1

# జనసాహితి - అరుణోదయ సంస్థల పునర్నిర్మాణ ఐక్యతా ప్రకటన

ఈనాడు ఉన్నత మానవతా విలువలు త్వరితంగాపతనం చెందుతూవస్తున్నాయి. పాలకవర్గాలు తమ ప్రయోజనం కోసం దేశప్రజలపై భూస్వామ్య, సామ్రాజ్యవాద సంస్కృతులను రుద్దుతున్నాయి. అయితే, ఈ సంస్కృతులకు వ్యతిరేకంగా చైతన్య వంతులైన ప్రజల కృషి ఫలితంగా సాహితీ సాంస్కృతిక ఉద్యమాలు సాగుతున్నాయి. విప్లవ సాహితీ, సాంస్కృతిక సంస్థలు దోపిడీ సంస్కృతిని ఎండగడ్తూ, ప్రజా సంస్కృతి నిర్మాణానికి నడుంగట్టూ, బాటలు వేస్తూ ముందుకుసాగాయి. ఈ ఉద్యమంలో ప్రవేశించిన పెడధోరణులను వ్యతిరేకిస్తూ 1974 లో అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, 1978 లో జనసాహితీ సాంస్కృతిక సమాఖ్యలు ఏర్పడి ప్రజాసాహితీ సాంస్కృతిక ఉద్యమంలో తమ వంతు పాత్రను చిత్త శుద్ధితో నిర్వహించాయి.

జనసాహితీ, అరుణోదయ, అరుణోదయ(ఆ.క.)సంస్థలు ప్రజాతంత్రవిప్లవం విజయవంతం కావాలని కోరుకుంటున్నాయి. ఆ విప్లవం విజయవంతం కావటానికి సాహితీ సాంస్కృతిక రంగాల్లో కృషి చేస్తున్నాయి. సామాజిక మార్పు సంస్కరణల ద్వారా సాధించవచ్చునని కొందరూ, వ్యక్తిగత హింసావాదమూ, దుందుడుకు చర్యల ద్వారా సమాజాన్ని మౌలికంగా మార్చడమే సరైన మార్గమని మరికొందరూ సాహితీ సాంస్కృతిక రంగాల్లో ఈనాడు ప్రచారం చేస్తున్నారు. సంస్కరణ వాదమూ, వ్యక్తిగత హింసావాదమూ సమాజాన్ని మౌలికంగా మార్చడానికి ఏనాడూ మార్గాలుగా తోడ్పడలేదు. మానవ సమాజాన్ని ముందుకు నడిపించడంలో అన్ని సందర్భాల్లోనూ పీడిత ప్రజలు సాగించే విప్లవాత్మకమైన సంఘటిత పోరాటాలే నిర్ణయాత్మక పాత్ర నిర్వహించాయి. మానవ సమాజ అభివృద్ధి, చరిత్రా ఈ విషయాన్ని స్పష్టంగా తెల్చి చెబుతాయి. భూస్వామ్య విధానానికీ, సామ్రాజ్యవాదానికీ వ్యతిరేకంగా కార్మికులూ, రైతాంగం, మధ్యతరగతి ప్రజలూ, భూస్వాముల దోపిడీకి, సామ్రాజ్యవాదుల పీడనకూ గురౌతూ అవి అంతం కావాలని కోరుకునే ఇతర దేశభక్తులూ, జాతీయవాదులూ సంఘటితంగా సాగించే విప్లవాత్మక పోరాటాల ద్వారానే మన దేశంలో ఈనాడున్న దోపిడీ వ్యవస్థ కూలి, నూతన ప్రజాతంత్ర వ్యవస్థ ఏర్పడుతుంది. ప్రజల విప్లవాత్మక శక్తిపై ప్రగాఢ విశ్వాసంవున్న అరుణోదయ (ఆ.క.) అరుణోదయ, జనసాహితి సంస్థలు ఈ అవగాహనకు భిన్నమైన అన్ని మార్గాల్ని తిరస్కరిస్తూ కృషి చేస్తాయి.

ఈనాటి సంక్షుభిత సామాజిక జీవనాన్నుండి విముక్తి పొందాలని ఆరాటపడు

తున్న భారత ప్రజల ఆశలకూ, ఆకాంక్షలకూ ప్రజా రచయితలూ, కళాకారులూ సాహిత్య కళా రంగాల ద్వారా తోడ్పాటు నందించాలి. ఎన్ని ఒడిదుడుకులకు లోనవు తున్నా ప్రజలు తమ సుందర భవిష్యత్తు కోసం సాగించే ఆందోళనల్లో సాహితీ సాంస్కృతిక శక్తులు అంతర్లీనం కావాలి. దోపిడీ వ్యవస్థ రద్దుకోసం జరిపే పోరా టానికి భావ విప్లవ రంగం బాసటగా నిలవాలి.

ప్రజా ఉద్యమాల ఒడుదుడుకులనూ, సిద్ధాంతాల గందరగోళాలను నిజాయితీగా పరిశీలించి, విశ్లేషించాక ప్రజాప్రతిఘటనోద్యమ దృక్పథానికనుగుణంగా తమ కార్య రంగంలో కృషి సాగించటం బాధ్యతాయుతమైన ప్రజా రచయితల, కళాకారుల తప్పనిసరి కర్తవ్యం.

ప్రజా జీవితం యొక్క సమస్త పార్శ్వాలనూ సాహిత్యమూ, కళలూ స్పృశించాలి, ప్రజలయొక్క సాంస్కృతిక అవసరాలను తీర్చగలగాలి. అదేవిధంగా ప్రజలయొక్క సామాజిక ప్రగతి, జీవనాభ్యుదయం వారి యొక్క క్రియాశీల ఉద్య మాల ద్వారానే సాధ్యం కనుక ప్రజారచయితల, కళాకారుల వక్కాణింపు సహ జంగా ఉద్యమ సమస్యలతో సహా వారి తక్షణ దీర్ఘ కాల డిమాండ్లపట్ల చైతన్యాన్ని కలిగించటంగా వుండాలి. అందుకు అడ్డంకిగా నిలిచే సమస్త భావజాలాన్నీ తూర్పార బెట్టాలి. ప్రజల్ని మత్తులో ముంచే, అణచివుంచే, పక్కదారి పట్టించే భూస్వామ్య, సామ్రాజ్యవాద సంస్కృతులను ఎండగట్టాలి. పై కర్తవ్యాలను నిర్వహిస్తూ పై సంస్థలు గత రెండు దశాబ్దాలుగా కృషి సాగిస్తూ వచ్చాయి.

ఈ రెండు సంస్థలూ మొదట్లో ఏర్పడినప్పుడు, ఆనాటి ఉద్యమస్థాయిని బట్టీ, ఉద్యమ అవసరాల రీత్యా, రచయితలకూ, కళాకారులకూ ఉమ్మడి వేదికలుగా కొన సాగి సత్ఫలితాలను సాధించాయి. ఐతే, ఈనాడు దేశంలోకి తీవ్రంగా చొచ్చుకు వస్తున్న సామ్రాజ్యవాద సంస్కృతి ఉప్పెననూ, పెచ్చరేగుతున్న భూస్వామ్య సంస్కృతిని ఎదుర్కోవటమూ ఒక చారిత్రక అవసరంగా గుర్తించి ఐక్యమౌ తున్నాం.

ఈనాడు వివిధ ప్రచార, ప్రసార సాధనాల ద్వారా, విద్యా విధానం ద్వారా గతంలో ఎన్నడూ లేనంత ఉధృతంగా ఒకవైపు మధ్యయుగాలనాటి అంధ విశ్వా సాలూ, బానిస మన స్తత్వాన్నీ, మత, కుల తత్వాలనూ, మరోవైపు- సామ్రాజ్యవాద సంస్కృతిలోని విచ్చలవిడి తనాన్నీ, బాధ్యతారాహిత్యాన్నీ, పతన విలువలనూ, అశ్లీలాన్నీ, హింసాత్మక ధోరణులనూ ప్రజల్లో ప్రవేశ పెట్టడం జరుగుతోంది. దేశ ఆర్థిక వ్యవస్థ విదేశాలకు తాకట్టు పెట్టబడింది. ఫలితంగా సామ్రాజ్యవాద, దళారీ సంస్కృతి రకరకాల రూపాల్లో దేశంలో ప్రవేశిస్తోంది. ఈ పరిస్థితిని ప్రతిభావం తంగా, శక్తివంతంగా ఎదుర్కొని, ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమాన్ని

(తరువాయి 48 వ పేజీలో)

ఐక్యతా సదస్సు తీర్మానం :

## కలం యోధుడు, ప్రజా కార్యకర్త కా॥ నూతన్‌కు అరుణారుణ జోహార్లు

కామ్రేడ్ నూతన్ కరీంనగర్ జిల్లా తిమ్మాపూర్ గ్రామంలో మధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు. విద్యార్థి దశలోనే ప్రజా ఉద్యమంతో సంబంధాలు ఏర్పరచుకొని 1977 కాలం నుండి ప్రజా కార్యకర్తగా పని చేస్తూ వున్నాడు. చిన్నతనం నుండే అభ్యుదయ భావాలు కలిగియుండి సమాజంలోని రుగ్మతల మీద కవితలు, పాటలు వ్రాసే వాడు. ప్రజా కార్యకర్తగా ఎదిగిన తర్వాత తనపై పెరిగిన బాధ్యత మూలాన తాను ప్రజా జీవితాల్లోకి చొచ్చుకొని పోయాడు. వారి బాధలను, సంస్కృతిని, ఆచార వ్యవహారాలను అధ్యయనం చేశాడు. వాటికి స్పందిస్తూ పాటలు, కవితలు, కథలు తన కలం ద్వారా కా॥ నూతన్ సృష్టించాడు. కలం పట్టినా చాలదు, గళం విప్పినా చాలదని, కత్తి కలం చేత బూని కర్షక జనంతో కలసి పోరిన విప్లవ సాంస్కృతిక సైనిక యోధుడు కామ్రేడ్ నూతన్. తునికాకు కూలీలను ఫారెస్టు అధికారులు ఎలా దోపిడి చేస్తున్నారో దానిని అధ్యయనం చేసి 'మల్లొత్తుంద్రే తునికాకు కల్లపోల్లు' అంటూ వాస్తవ చిత్రీకరణ చేశాడు. ఈనాడు కూడా తునికాకు కూలీలు ఈ పాటను పాడుతూనే వున్నారు. విప్లవ ఉద్యమ విస్తరణలో సైతం కామ్రేడ్ నూతన్ కృషి చాలా గొప్పది. విప్లవోద్యమంలో జరిగిన చీలిక కాలంలో సైతం విప్లవ సహచరులకు, సానుభూతిపరులకు గుండె నిబ్బరాన్నందించుటకు "సింతిలబోకు ఓ పోరుకేసే కామ్రేడా" అంటూ పాట ద్వారా ప్రచారం చేశాడు. కరీంనగర్ మాండలీకంలోనూ పోరాటాల, ప్రజా జీవితాల కవితలను ఎన్నో వ్రాసాడు. కామ్రేడ్ నూతన్ 1982లో విరసం సభ్యునిగా చేరి సాహిత్యోద్యమానికి, విప్లవ కార్యాచరణకు కృషి సల్పాడు. ఆదిలాబాద్ జిల్లాలో గిరిజనులతో తన జీవితాన్ని పంచుకొన్నాడు. వారి బాధలను, జీవితాలను, గిరిజన సంస్కృతిని, భాషను అధ్యయనం చేశాడు. గోండు భాషలో సైతం పాటలు వ్రాసి గోండు ప్రజలను విప్లవోన్ముఖులను చేశాడు కామ్రేడ్ నూతన్. అడవి సంపదపై సామ్రాజ్యవాదులు పట్టును పొందడానికి చేస్తున్న చర్యల్లో భాగంగా సిమెంట్ ఫ్యాక్టరీలను నెలకొల్పారు. ఈ ఫ్యాక్టరీల మూలాన నిర్మలమైన ప్రకృతి కాలుష్య ముప్పుకు గురై అడవి బిడ్డల జీవితాలను కాటు వేస్తుంటే, స్పందించి కాలుష్యం మీద పాట, వ్యాసం వ్రాసి, గిరిజన భాషలో గిరిజనుల జీవితాల్లోకి తీసుకు వెళ్ళి ఉద్యమాలు జరిపాడు. కామ్రేడ్ నూతన్ తన జీవిత అనుభవాలని విప్లవ కార్యాచరణకు

(తరువాయి 47 వ పేజీలో)

# "నా రూపం మార్చుకుంటాను - కాని నేను మరణించను"

బ్రిటీషు పరిపాలకులతో పత్రికా సంపాదకునిగా మహదేవ దేశాయ్ పోరాటం గురించి.

— ఉద్యమ సూర్యుడు

మహదేవ దేశాయ్ 25 ఏళ్ళ పాటు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీకి ప్రధాన కార్యదర్శిగా, అంతరంగిక కార్యదర్శిగా పనిచేశారు. దేశాయ్ శతజయంతి సంవత్సరం ఇది. ఆయన అఖిల భారత వార్తా పత్రికల సంపాదకుల మహాసభ సంస్థాపక సభ్యుల్లో ఒకరు.



మోతీలాల్ నెహ్రూ స్థాపించిన 'ది ఇండిపెండెంట్' పత్రికకు, గాంధీగారి అనుమతితో మహదేవ దేశాయ్‌ను సంపాదకునిగా తీసుకున్నారు. ఈ పత్రిక అలహాబాదు నుంచి సయ్యద్ హుస్సేన్ సంపాదకునిగా ప్రారంభమైంది. 1921లో సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొన్న ప్రముఖ లాయర్ జార్జి జోసఫ్ దానికి సంపాదకునిగా వుండేవాడు.

ఆనాడు బ్రిటీషు నిర్బంధం పరాకాష్ట దశకు చేరుకుంది. వార్తాపత్రికలు నడిపేవారు వేలాడే కత్తికింద కూర్చున్నట్లే వుండేది. బ్రిటీషు వ్యతిరేక రచనలు ప్రచురించినందుకు నెహ్రూలనూ, సంపాదకుడిని అరెస్టు చేశారు. సత్ప్రవర్తనకు గాను 2000 రూపాయలు సెక్యూరిటీ కట్టమన్నారు. 1921 డిసెంబర్ 7న ఈ సెక్యూరిటీ కట్టి మహదేవ దేశాయ్ పత్రికకు సంపాదకునిగా తన పేరు రిజిష్టర్ చేసుకున్నారు.

మరల డిసెంబర్ 20వ తేదీన పాత సెక్యూరిటీని స్వాధీనపరచుకొని, మరల పదివేలు రూ॥ సెక్యూరిటీ కావాలని ప్రభుత్వం అడిగింది. మహదేవ దేశాయ్ ఇది చెల్లించడానికి నిరాకరించారు. వెంటనే అదే పత్రికను వ్రాత పత్రికగా ప్రారంభించి, "నేను మారతాను - కాని నేను మరణించను" అనే వాక్యం మోటో (motto) గా ప్రచురించారు.

ఈ పత్రిక నూతన అవతారం గురించి రాస్తూ- "ఈ నూతన అవతారం రావడానికి కారకులైనవారు-కళ్ళున్నా చూపు లేనట్లే, చెవులున్నా చెవిటివారే- అర్థం సుకోలేరు. ఈ నిర్బంధ విధానం, చీకట్లోకి తలక్రిందులుగా దూకినట్లుంది. మ్ములను అరెస్టు చేయడం ద్వారా ప్రభుత్వం అవగాహనా శక్తిని గొడ్డలితో

నరికి వేసుకున్నట్లే అయింది. మా రచనలూ, ఉపన్యాసాలూ చూస్తున్నా చూడనట్లూ వింటున్నా విననట్లూ అయింది. ఉదాహరణకు సర్ హార్ కోర్టుకు కళ్ళుంటే,చెవుల పనిచేస్తుంటే, అవగాహనా శక్తి వుంటే అతను ఇంత వాగే వాడా? మాంటేగ్ 'ఇండియాలో నిర్బంధం లేదు' అని హాస్య ప్రకటన ఇచ్చి వుండేవాడేనా?"

70 ఏళ్ళ క్రితం డిసెంబర్ 21వ తేదీన రిజిస్టర్ చేయని చేతివ్రాత దిన పత్రిక 'ది ఇండిపెండెంట్'కు కాపీలు మామూలు పద్ధతుల్లో తీసేవారు. కొత్త ప్రయోగం కావడంతో ప్రజాదరణ పొందింది. ఎక్కువెక్కువ డబ్బు చెల్లించి దేశ భక్తులు ఆ వ్రాత పత్రికను కొనుక్కునేవారు.

సెక్షన్ 17 (1) క్రిమినల్ లా సవరణ చట్టం క్రిందా, భారత శిక్షాస్మృతి సెక్షన్ 117 క్రిందా మహాదేవ దేశాయ్‌ను విచారించి, ఒక సంవత్సరం కఠిన కారాగార శిక్ష విధించారు. ఆయన నేరం వ్రాత పత్రిక నడపడం-బ్రిటీషు వ్యతిరేక రచనలు చేయడం. మహాదేవ దేశాయ్ 'ది ఇండిపెండెంట్'లో తన వీడ్కోలు సందేశం ఇలా ఇచ్చారు :

"ఈ రోజు జిల్లా మేజిస్ట్రేట్ నన్ను తన ముందు హాజరు కమ్మన్నాడు. సి.సి.ఎ. సెక్షన్ 17 [1] క్రిందా, భారత శిక్షాస్మృతి 117 క్రిందా నన్ను విచారిస్తా నన్నాడు. ఎప్పటినుంచో దీనికోసం నేను ఎదురు చూస్తున్నాను....నేను ఎలా ఊహించానో సరిగ్గా అలాగే జరుగుతోంది. నిన్న నేను ప్రభుత్వం ఎలా ఉన్మాద పూరితమౌతోందో ప్రస్తావించాను. ఈ ఉన్మాదం నెమ్మదిగా వచ్చినదికాదు. ఈ వ్యాధి అతి త్వరితంగా పెరిగిపోతోంది. వ్రాత ప్రతులనూ, కార్బన్ కాగితాలనూ కాపీ పెన్సిళ్ళనూ, ఇతర స్టేషనరీ సామగ్రినీ, సైక్లో యంత్రాన్నీ - అన్నీ స్వాధీన పరచుకోవడం ఉన్మాదం కాక మరేమిటి? వీటిలో కొన్ని స్నేహితుల నుంచి అప్పు తెచ్చుకున్న విలువయిన సామగ్రి వుంది.

"వార్తలు, వ్యాఖ్యలు, భావాలు ప్రచారం చేయడానికి ఇంకా సవాలక్ష పద్ధతు లున్నాయని ఆలోచించే మెదడే వారికి లేదు. మా నోళ్ళూ, చేతులూ కట్టివేస్తే- మా సంస్థకు చెందిన ఇతర సభ్యులు పనిచేస్తున్న విషయం వారికి తెలియదా? అదీ గాక మా ఆత్మను కనీసం వారు అంటుకోలేరని తెలియదా? ఒక వృద్ధుడు - దేశ భక్తుడు నాతో ఇలా అన్నాడు—'మనం తలచుకోవాలే గాని, గట్టి పట్టుదల ఉండాలే గాని,- ముప్పైకోట్ల భారతీయుల ఉచ్ఛ్వాస నిశ్వాసాల ద్వారా విడుదలవుతున్న బొగ్గుపులుసు వాయువు చాలు, మొత్తం బ్రిటీషు రాజ్యాన్ని అంతమొందించడానికి- నిస్వార్థంగా బాధను భరించడమనేది- భూలోకంలోని అత్యంత దుష్ట శక్తిని కూడా ఓడగొడ్తుంది. ఈ విశ్వాసంతో వీడ్కోలు తీసుకుంటున్నాను." →

→ కేసు విచారణ సందర్భంగా మహదేవ దేశాయ్ ఇలా అన్నారు : "మనం ఒక యుద్ధం చేస్తున్నాం. నేను మీ ముందు యుద్ధ ఖైదీలా నుంచున్నాను. సహాయ నిరాకరణ వాదులమయిన మేము మీలాగా హింసపై ఆధారపడి వుంటే మీరు గానీ, మీలో కొందరు గాని, మా యుద్ధ ఖైదీలై వుండేవారు. ఐతే-పాపము శమించుగాక- మేము ఏ మనిషినీ యుద్ధ ఖైదీగా బంధించి మా సృష్టికర్తకు వ్యతిరేకంగా పాపం చేయము.

"ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే, మేము చేసిన అతి తక్కువ నేరానికి మమ్మలను శిక్షించబోతున్నారు. మీ చట్టాలను వేటినీ మేము గుర్తించకపోవడం- ఉదాహరణకు మీ క్రిమినల్ చట్టం సవరణనూ, గవర్నర్ జనరల్ చేసిన చట్టాలనూ- గుర్తించకపోవడం అనే పెద్ద నేరం మేము చేస్తున్నాం. మీరు వేసే అత్యంత కఠిన శిక్షకు మేము తయారుగా వున్నాం. నరకంలోని చిత్రవధలన్నీ పెట్టినా మాలో వున్న తీవ్రమైన తిరుగుబాటు తత్వాన్ని మీరు చంపలేరు."

[ది ఇండిపెండెంట్-బొంబాయి, ఆంగ్ల దినపత్రిక 1991 డిసెంబర్ 21 సౌజన్యంతో]

# అమెరికాలో ఆఫ్రికన్ జాతి పరిస్థితి

—డా॥ కిరణ్మయి

అమెరికా (USA) దేశ జనాభాలో ఆఫ్రో అమెరికన్లశాతం 12 కాగా, దేశంలో వున్న 2.4 మిలియన్ నేరస్తుల్లో 30 శాతం మంది ఆఫ్రో అమెరికన్లే. విచారణలో వున్న 2,75,000 నేరస్తుల్లో 41 శాతం మంది ఆఫ్రో అమెరికన్లే. ఫెడరల్ స్టేట్ కారాగారాల్లో వున్న 5,47,000 ఖైదీల్లో 45 శాతం ఆఫ్రో అమెరికన్లే. అంటే ఒక మిలియన్‌కిపైగా ఆఫ్రో అమెరికన్లు జైళ్ళల్లో వున్నారు.

ఇదీ అమెరికాలో నల్లజాతి వారి పరిస్థితి. జాతివివక్షణా విధానం దక్షిణాఫ్రికాలో మాత్రమే వుందని ప్రచారం సాగుతోంది. అమెరికాలోనూ ఈ వివక్షణ వుంది. క్రిమినల్ లా లో ఈ వివక్షణ మరింతస్పష్టంగా కనబడ్తోంది. న్యూయార్కు పట్టణంలో అమలులో వున్న క్రిమినల్ లా ప్రకారం తెల్లజాతివాడు బందిపోటు దొంగతనంచేస్తే 29 నెలల శిక్ష, అదేనల్లజాతివాడైతే 31 నెలల శిక్ష విధిస్తున్నారు. లైంగిక దాడి చేసిన నేరానికి తెల్ల జాతి వారికి 42 నెలలుకాగా, నల్లజాతివారికి 47 నెలల శిక్షవుంది. హత్యా నేరానికి తెల్లజాతివారికి 72 నెలలుకాగా, నల్లవారికి 85 నెలల శిక్ష. ఇవి ప్రొఫెసర్ ఆండ్రూహ్యాకర్ 1987లో **New York Review of Books** లో రాసిన **'Black Crime - White Racism"** అనే వ్యాసంలో ఇచ్చిన వివరాలు :

**1990** లో వెలువడ్డ **Statistical Record of Black America** పుస్తకంలోని వివరాల ప్రకారం-దారిద్ర్యరేఖ దిగువన వున్న తెల్లజాతి కుటుంబాల శాతం 1( మాత్రమే కాగా, ఆఫ్రికన్ అమెరికన్ కుటుంబాల శాతం 31.6 గా వుంది. తెల్లజాతి వారి సగటు కుటుంబ ఆదాయం 32, 1:4 డాలర్లు కాగా, నల్లజాతివారి ఆదాయం 18,098 డాలర్లు మాత్రమే. అమెరికాలో నిరుద్యోగులుగా 7 మిలియన్ల ప్రజలుంటే వారిలో 2 మిలియన్లు ఆఫ్రికన్ అమెరికన్లే - 1989 లో • **Per Capita Incom**( తెల్లవారిది 14,896 డాలర్లు కాగా నల్లజాతివారి ఆదాయం 8,747 డాలర్లు మాత్రమే

(వచ్చే సంచికలో వియత్నాం యుద్ధంలో అమెరికన్ కిరాతక సైన్యం చేసి 'మే లే' (My lai) హత్యాకాండ గురించి)

అమెరికన్ నీగ్రో కవితలు రెండు :

## చావాల్సి వస్తే...

-క్లాడ్ మెకే

చావాల్సివస్తే -
పందుల్లా వేటాడబడి / దొడ్లో బంధింపబడి
వాళ్ళు హేళనచేస్తూంటే మన దురవస్థని చూసి
మనచుట్టూ పిచ్చికుక్కలు అరుస్తూ తిరుగుతూంటే
ఆ నీచమైన చావు మనకొద్దు
మరణించాల్సి వస్తే, ఉన్నతంగా మరణిద్దాం
మన విలువైన రక్తాన్ని వ్యర్థంగా చిందించ వద్దు
ఎంతటి క్రూరుణ్ణయినా, రాక్షసుణ్ణయినా
ఎదురొడ్డి ప్రతిఘటిద్దాం / అలాంటి మరణం మనకి గౌరవం
చేకూరుస్తుంది / ఓ నా బంధు మిత్రులారా!
మనందరం శత్రువు మీద విరుచుకు పడదాం
వాళ్ళెందరు వున్నా - మన ధైర్యసాహసాలు వారికి చూపిద్దాం
వాళ్ళు వేయి దాడులు చేయనీ - మనం ఒకే ఒక్క మారణాయుధాన్ని
ప్రయోగిద్దాం,
అది మృత్యువు! నోళ్ళు తెరుచుకున్న గోరీల్లోకి ప్రవేశించే మనకేం భయం?
హంతక పిరికి మూకని
మనుషుల్లా ఎదుర్కొందాం / మరణిస్తూనే ప్రతిఘటిద్దాం!

## ముందస్తు బెయిల్ లేకుండా అరెస్టయిన బాలిక కథనం

-మార్గరేట్ వాకర్

(అన్యాయం, అక్రమం గద్దెక్కి కూచున్న దేశంలో నిజాయితీపరునికీ
న్యాయమైన వ్యక్తికీ చోటు జైలే)
నా కిక్కడే ఎంతో బాగుంది / నాకు బెయిల్ అక్కర్లేదు
నా చెల్లి వుంది ఇక్కడ/నా తల్లి వుంది ఇక్కడ
నా స్నేహితురాండ్రున్నారు ఇక్కడ
నా హక్కులు నాకు కావాలి / నేను హక్కుల కోసం పోరాడుతున్నా
నన్ను ఇతరుల్లాగానే చూడండి/నన్ను మిగతావాళ్ళలాగానే చూడండి
నాకు ఇక్కడే ఎంతో బాగుంది / నా కెలాంటి బెయిలూ అక్కర్లేదు !

# ఇక్కడ చదువు "కొనవలెను"

— ఎస్కె



గ్రీష్మం నిషేధానికి గురైన టెర్రరిస్టు గ్రూపులా అసహనంగా నిప్పులు చెరుగుతోంది. పదో తరగతి పబ్లిక్ పరీక్షలైపోవటంతో మిగతా హైస్కూలు విద్యార్థులకంటే పదిహేను రోజులు ముందుగా ఆటవిడుపు దొరికిన శ్రీకాంత్, నాన్న భయంతో ఏడాది క్రితం అటకెక్కించిన క్రికెట్ కిట్‌ని సద్వినియోగం చేసే ప్రణాళిక గురించి ఆలోచిస్తున్నాడు. నిజానికా ఆలోచన చివరి పరీక్ష సగం వ్రాసేసరికే మొదలై....క్షణ క్షణ ప్రవర్ధమానమై ఇంటికి రాగానే అటక ఎక్కింది. అక్కడినించీ క్రిందికి దిగే లోపలే నాన్న గృహ ప్రవేశం చెయ్యటంతో త్రిశంకు స్వర్గంలో నిలిచిపోయింది. చీమ చిటుక్కుమన్నా విన్పించే నిశ్శబ్దాన్ని అటక మీద చల్లి....రానున్న తుపాను ఏ రూపంలో చెవి సోకుతుందా? అని నిరీక్షిస్తున్నాడు.

షర్టు తీసి హేంగర్‌కి తగిలిస్తూ "ఏమోయ్! పరీక్ష ఎలా వ్రాశాడట నీ కొడుకు?" అన్నాడు మూర్తి భార్యతో.

"మీకు సంతోషం కలిగించే పని చేసినపుడు నా కొడుకు అనీ.... ఇష్టంలేని పని చేసినప్పుడు నీ కొడుకు అనీ అనటం తప్ప 'మన కొడుకు' అని అనరు కదా!" చిరాగ్గా అంటూ, "బాగానే వ్రాశాడట! ఫస్టు క్లాసు రావచ్చునంటున్నాడు" అంది భార్య.

"'రావచ్చు' ఏమిటి?" రాకపోవచ్చునన్న సమాధానం రిజర్వ్ చేసుకుంటూన్నట్లు!

"చాల్లే, ఊరుకోండి! ఫస్టు క్లాసొచ్చినా, సెకండ్ క్లాస్ వచ్చినా అవి వాడి కష్టార్జితం మార్కులు. ఫస్టు క్లాసొస్తుందని ధీమాగా చెప్పగలిగేందుకు వాడ్ని మీరేమన్నా రెసిడెన్షియల్ స్కూల్లో చేర్చారా? చూడండి! పోయి నేడు మునిసిపల్ స్కూల్లో తొమ్మిదో తరగతి చివరి ర్యాంకులో ఉన్న మన పక్కింటి వాళ్ళబ్బాయిని రెసిడెన్షియల్ స్కూల్లో చేర్చారా! వాడిప్పుడు తనకి ఫస్టు క్లాసు ఖచ్చితంగా వస్తుందంటున్నాడు. మనం ఒక్కగానొక్క కొడుకు గురించి ఏనాడన్నా పట్టించుకుంటేగా?" మూతి తిప్పింది సుశీల.

"పట్టించుకోవటమంటే....నీ నిర్వచనం ప్రకారం ఏమిటి? మన వాడివి

స్వార్జితం మార్కులని నువ్వే అంటున్నావు కదా! అవి ఎన్నయినా మనకా తృప్తి చాలు! పరీక్ష పేపర్లు కొనీ, ఇన్విజిలేటర్లని మేనేజ్ చేసి, స్పాట్ వాల్యుయేషన్‌లో గారడీలు చేసి 'అత్యుత్తమ ఫలితాలు' సాధించటం ద్వారా విద్యను ఆకర్షణీయమైన వ్యాపారం చెయ్యటం సమాజానికి ఎంత హానికరమో ఆలోచించావా?"

"సమాజం గురించి మనకెందుకు? మన బిడ్డ భవిష్యత్తు గురించి ఆలోచించ మంటే సమాజం అంటూ ఏవో మాట్లాడతారేమిటండీ?"

"ఏ ఆలోచనయినా సామాజిక స్పృహ పరిధిలోనే జరగాలి కాబట్టి!"

"ఆ వ్యాసార్థాలూ, పరిధులూ మీ స్వంత విషయాలకి అన్వయించుకోండి గానీ మనవాడు ఇంజనీరో, డాక్టరో అయ్యే మార్గం ఆలోచించండి. కనీసం ఇంటర్‌లో నన్నా, వాడిని మంచి రెసిడెన్షియల్ కాలేజీలో చేర్చండి!"

"మన స్తోమతుకి రెసిడెన్షియల్ కాలేజీల్ని భరించగలమా? వీడు సరిగ్గా చదివేడిస్తే మామూలు కాలేజీలు చాలవూ?"

"ఆ....చాల్చాలు! అమ్మ పెడితే అడుక్కు తినటమెందుకట? రెగ్యులర్ కాలేజీల్లో వేలకివేలు జీతాలు తీసుకుంటూ, నిముషాలు సెకండ్లు కూడా లెక్కలు వేసుకుంటూ చెప్పే లెక్చరర్లే ఇంటి దగ్గర ట్యూషన్లలో ఎంత బిజీగా ఉంటున్నారో, మనం చూడటల్లేదా? ఏదో ఒక రెసిడెన్షియల్ కాలేజీలో భాగస్వామ్యమో, భారీ పారితోషికంతో ఉద్యోగమో లేని లెక్చరర్ని చూపించండి!"

"నిజమేననుకో! విద్యా విధానం ఇలా అధోగతి పాలు కావటానికి ఏ ఒక్కర్నో నిందించి ప్రయోజనం లేదు. ప్రభుత్వ బాధ్యతా రాహిత్యమూ, ప్రజల అలసత్వమూ కూడా అందుక్కారణమే!"

"మళ్ళీ సమగ్ర పరిశీలనలోకి వెళ్ళిపోయారా? ముందు వాడ్ని ఏదో ఒక చోట సమ్మర్ కోచింగ్‌కి చేర్పించండి."

"చూడు సుశీ! సంవత్సరంలో పదకొండు నెలలు చదువుతో సతమతమైన ఆ చిన్నారి మెదళ్ళకి ఆటవిడుపు ఈ ఒక్క నెలే. తరువాత మరో పదకొండు నెలలు ఏకాగ్రతతో చదివేందుకు ఆ లేత మనసులకు ఈ నెల విశ్రాంతి అవసరం. దాన్ని వాళ్ళకెందుకు దూరం చెయ్యాలి? అది న్యాయమా? ఇందాకే చెప్పాను.... విద్యను వ్యాపారంగా మార్చిన ఫక్తు వ్యాపారస్తులు....పిల్లల మానసికారోగ్యాన్ని కూడా కనీసంగా పట్టించుకోకుండా లాభార్జనే ధ్యేయంగా వ్యవహరించటంవల్ల అసలు వేసవి సెలవుల ఉద్దేశ్యమే విఫలం కావటల్లేదూ? ఈ క్షుద్ర వ్యాపారస్తుల స్వార్థానికి సమిధలవుతున్న వేలాది, లక్షలాది పిల్లల్లో మన వాడినీ ఓ సమిధను చేదామంటావా?"

ఎసవి కాలపు ఉక్కపోత అటక మీద రెట్టింపుగా వుంది. అయినా నాన్నకి భయపడి విగ్రహంలా బిగుసుకుపోయి అక్కడే వుండిపోయిన శ్రీకాంత్ తల్లి నోటి వెంట వచ్చిన సమ్మర్ కోచింగ్ మాటతో ఉలిక్కిపడ్డాడు. రాష్ట్రంలో తంతే రాజ్య సభలో పడ్డ పి.సి.సి. అధ్యక్షుడిలా అయిందతని పరిస్థితి. అయితే ప్రస్తుతానికి నాన్న వాదన తన పక్షంగానే వుంది గనక ధైర్యం చేసి అటకమీది నించి క్రికెట్ కిట్‌తో సహా దూకినట్లు దిగాడు శ్రీకాంత్.

"ఏరా బడుద్దాయ్! ఈ మండుటెండల్లో క్రికెట్ ప్లాన్ చేస్కున్నావన్న మాట! నీలాంటి వాడికి మీ అమ్మ చెప్పినట్లు సమ్మర్ కోచింగ్ లాంటిదే సరయిన వైద్యం. ఏ.పి.ఆర్.జె.సి. కోచింగ్‌లో చేరుస్తాను, తగలడు." చిటపటలాడు తున్నాడు మూర్తి. ఉగ్రవాద ప్రాంత ఎం.పి.కి పోలీసు రక్షణ తీసేసినట్లు విల విల్లాడింది శ్రీకాంత్ మనస్సు.

* * *

ఆ స్వంతా తీర్థ యాత్రలకి తగలేసిన బామ్మకి తండ్రి పెడుతున్న తద్దినంలా మొక్కుబడిగా కోచింగ్ సాగిపోతోంది. అంతలో టెన్త్ రిజల్ట్సు వచ్చాయి. శ్రీకాంత్ ఫస్టు క్లాసులో పాసయ్యాడు. రిజల్ట్సుతో పాటే ప్రయివేటు రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీల (రె.జూ.కా) ప్రకటనల వరద రాష్ట్రాన్ని ముంచెత్తుతోంది. దినపత్రికల పంట పండుతోంది. ఒక్కోసారి ముఖ్యమైన వార్తలు కూడా మరునాటికి వాయిదా పడిపోతున్నాయి. తరువాత వారం లోపే ఇంటర్ ఫలితాలూ.... వాటి వెనుకే ఎంసెట్ కోచింగ్ ప్రకటనలూ ఉప్పెనలా విరుచుకుపడ్డాయి. ప్రభుత్వ ప్రకటన ప్రకారం రాష్ట్రంలో టెన్త్ 28 శాతం, ఇంటర్ 22 శాతం మాత్రమే పాస్ కాగా ప్రయివేటు విద్యా సంస్థల ప్రకారం ఇంటరూ, టెన్తూ కూడా సెంట్‌పర్సెంట్ ఫస్టుక్లాసులో పాసయినట్లు లెక్కలు తెలుపుతున్నాయి. ఈ నేపథ్యంలో ఆ రోజే ఏ.పి.ఆర్.జె.సి. ఫలితాలు వచ్చాయని తండ్రి వీధి వాకిట్లోకి వచ్చేసరికే అర్థమైంది శ్రీకాంత్‌కి. ఆయన ఇంటి లోపలి కొచ్చేసరికి తనకి అందుబాటులో సీటు రాలేదనీ అర్థమైపోయింది. అయితే—అయిందానికీ, కానిదానికీ తారాజువ్వలా ఎగిరిపడే తండ్రి ఏమీ అనకపోవటం ఆశ్చర్యం కాగా, అన్నిటికీ తనవే వెనకేసుకొచ్చే తల్లి చిచ్చుబుడ్డిలా మండిపడటం శ్రీకాంత్‌కి మరింత ఆశ్చర్యం కలిగించింది.

"వెధవా! మనస్సు క్రికెట్ మీద పెట్టి వానాకాలం చదువులు చదివితే ఎందు కొస్తుంది? ఇంకోటి చదువుకి నా బంగారు గాజు తాకట్టు పెట్టి మరీ ఫీజు కట్టాం కదరా!" అమ్మ కోపానికి అసలు కారణం అప్పుడర్థమైంది శ్రీకాంత్‌కి.

ఆ మర్నాడే వివిధ కోచింగ్ సెంటర్ల ప్రకటనలు దినపత్రికల్లో దర్శన మిచ్చాయి. ఆ ప్రకారం చూస్తే ఆ ఒక్క జిల్లాకే నాలుగు వందల సీట్లు వచ్చినట్లు!

కాని రాష్ట్రంలో ఉన్నవి మూడు ప్రభుత్వ రెసిడెన్షియల్ కాలేజీలు మాత్రమే. జిల్లాలవారీ కోటాలో ఒక్కో జిల్లాకి 20 సీట్లు మాత్రమే వస్తాయి. అంటే ప్రకటనల్లో అత్యధిక శాతం 'బోగస్' అని బుర్రతో ఆలోచించకలిగితే ఎవరికయినా అర్థమై తీరుతుంది.

ఏ.పి.ఆర్.జె.సి.లో సీటు రాకపోవటంతో శ్రీకాంత్ ఏ కాలేజీలో చేరాలన్నది తక్షణ సమస్య అయింది. ఆ ఇంటి దేశంలో జరిగిన అంతర్యుద్ధంలో తల్లి గెలిచింది. శ్రీకాంత్ రెసిడెన్షియల్ కాలేజీలో ఇంటర్ చదవటం దాదాపు ఖాయమైంది. ఆ వెంటనే మొదలయింది ఎక్కడ చేర్పాలన్న సమస్య. ఆఫీసునుంచి అన్ని దిన పత్రికలు తెచ్చి ముందు పేసుక్కూర్చుని మంచి రెసిడెన్షియల్ జూనియర్ కాలేజీ (రె.జూ.కా.) వేటలో పడ్డారు. తీరా పని మొదలెట్టాక అది చేటలో బియ్యంలో ఒక్క గింజని ప్రత్యేకంగా గుర్తుపెట్టుకోవటం కన్నా కష్టంలా తోచింది.

ప్రస్తుత మాజీ దేశ నాయకులూ, సైంటిస్టులూ, ముక్కోటి దేవతల పేర్లూ, విదేశీ స్వదేశీ ప్రముఖుల పేర్లూ చాలక ...శాతవాహనులూ, కాకతీయులూ, ఇక్ష్వాకులూ, చోళులూ, పల్లవులూ, మొగలాయిలూ అందరూ 'రె.జూ.కా.'ల పేర్లు అలంకరించారు. తరువాత్తరువాత కాలేజీలు పెట్టినవారు వాటికి పేర్లు దొరక్క ఇంటిపేరుతో సహా భార్యాబిడ్డల పేర్లూ, తమ పేర్లతో కూడా పెట్టేశారు. ప్రకటనల ద్వారా జనాన్ని ఆకర్షించటంలో భాగంగా ఆయా కాలేజీల్లో పనిచేసే లెక్చరర్ల పేర్లు....నిక్ నేమ్స్‌తో సహా (అసలు పేరు కంటే నిక్ నేమ్స్ ఎక్కువ ప్రచారం పొందుతాయన్న ప్రగాఢ విశ్వాసం కాబోలు!) ప్రచారంలో భాగమైపోయాయి.

ఎట్టకేలకు రాత్రింబవళ్ళు కష్టపడి ఓ డజను 'రె.జూ.కా.'ల లిస్టు తయారు చేశారు. శ్రీకాంత్‌ని ఎందులో చేర్పాలన్నది స్వయంగా విచారించాక నిర్ణయించదలిచారు. మూర్తి కొడుకుని వెంటబెట్టుకొని పర్యటన ప్రారంభించాడు. ముందుగా 'ఐన్‌స్టీన్ రె. జూ. కా.'లో చదివి ఇంటర్ స్టేట్ ర్యాంక్ సాధించిన న్యూటన్‌రావు ఇంటికి వెళ్ళారు. అక్కడ అతనొక్కడే వున్నాడు.

"బాబూ! న్యూటన్‌రావంటే నువ్వేనా?"

"అవును."

"కంగ్రాచ్యులేషన్స్ బాబూ! ఇంటర్‌లో స్టేట్ ర్యాంకు సాధించినందుకు. నీ సలహా తీసుకుని మావాడ్ని ఐన్‌స్టీన్ రె.జూ.కా.లో చేరుద్దామనుకుంటున్నాను." ఇరవై ఏళ్ళు గుండెల్లో దాచుకుని పెంచిన ఆడపిల్లని మరో అయ్య చేతిలో పెడుతున్న కన్నతండ్రికన్నా ఎక్కువ ఆతృతగా అడిగాడు మూర్తి.

"సారీ సర్!" ఆపై మాట్లాడ్లేక వెక్కిళ్ళు పెట్టసాగాడతను.

"అరె! ఎందుకు బాబూ! ఏడుస్తున్నావ్?"

అతను తేరుకుని, "ఆ కాలేజీలో అసలు లాబొరేటరీ వసతుల్లేవండి. మేం ఒకటికి రెండుసార్లడిగితే....మనకి ప్రాక్టికల్స్‌కి ఫలానా కాలేజీలో వేస్తారు. మీకు ఫుల్ మార్క్స్ వచ్చేలా మేం మానేజ్ చేసుకుంటామన్నారు. వాళ్ళ అంచనాలకు భిన్నంగా అనుకోకుండా మా సెంటరు మారింది. ఫలితంగా నా పరీక్ష పోయింది" భోరుమన్నాడు న్యూటన్‌రావు.

షాక్‌తో అతన్ని ఓదార్చటం కూడా మర్చిపోయాడు మూర్తి.

"మరి నీ స్టేట్ రాంకూ, వారి సెంట్‌పర్సెంటు ఫస్టుక్లాసులూ...."

"యం.పి.సి.లో అందరూ ఫెయిలయ్యారండీ! రెండేళ్ళకీ మొత్తం నలభై వేలు ఖర్చుపెట్టి..." ఆపై అతని స్వరం మూగబోయింది. అతన్ని ఓదార్చి, బయటపడి, అదే ఊళ్ళో ఉన్న మరో విద్యార్థి ఇంటికి బయలుదేరారు. అతనికి జిల్లా ర్యాంకు వచ్చిందని పేపరు ప్రకటన.

కాలింగ్ బెల్ మ్రోగగానే ఒక స్త్రీ వచ్చింది.

"మీరు రాజా తల్లిగారాండీ?" అడిగాడు మూర్తి.

"ఔనండీ!" ఆమె ముఖంలో గర్వం తొణికిసలాడింది.

"మేం మీ రాజా కోసం వచ్చామండీ!"

"మీరు పేపరువాళ్ళా?" మా దగ్గర కెమేరాల కోసం వెదుకుతున్నట్లున్నాయామె చూపులు.

"రెసిడెన్షియల్ కాలేజీవారా? లేక ఎంసెట్ కోచింగ్ వాళ్ళా? ఇప్పటికే మా వాడి ఇంటర్ ర్యాంకు మూడు జిల్లాల్లోని 3 కాలేజీలకు ప్రచారం కోసం అమ్మేశామండీ. వాడికి ఎంసెట్ మంచి ర్యాంకు వస్తే, దాని రేటు అప్పుడు నిర్ణయిస్తాం."

"అమ్మా! ఈ కొత్త వ్యాపారం గురించి అర్థమయ్యే స్థితికి నేనింకా రాలేదు. ఇతను మా అబ్బాయి. మీ బాబు చదివిన కాలేజీ గురించి విచారిద్దామని వచ్చాను."

"అయ్యో! పాపం వాడు ఎంసెట్ కోసం నిద్రాహారాలు మాని రాత్రింబవళ్ళు కష్టపడుతున్నాడండి. వాడి టైమక్కడ వృథా చెయ్యక త్వరగా మాట్లాడి వెళ్ళండి. అది చాలా మంచి కాలేజీ. మీరు అక్కడే చేర్చండి మీవాడ్ని కూడా" అందామె. తమ రికమెండేషన్‌కి అందబోయే కమీషన్ గుణించుకుంటూ, రాజాని పిలిచిందామె.

"బాబూ! నువ్వు జిల్లా ర్యాంకు సాధించినట్టు పేపర్లో చూశాను. అన్నట్లు నువ్వే కాలేజీలో చదివావు?"

"అల్లూరి సీతారామరాజు రె.జూ.కా.లోనండి."

"పేరునిబట్టి చాలా ఆదర్శవంతమైన కాలేజీలా వుందే!"

"మరండీ! మా ప్రిన్సిపాలుదీ అదే కులమండి."

"అలాగా! అక్కడ స్టడీస్, హాస్టలూ బాగుంటాయా?"

"మా ప్రిన్సిపాల్ చాలా స్ట్రిక్టు. లెక్కల్తో సహా ఏదయినా పుస్తకంలో ఉన్నదున్నట్లు అప్పజెప్పాల్సిందే! లేకపోతే బాణంతోనే బాదేస్తారు. మాకు పండుగ దినాలూ, ఆదివారాలూ కూడా కాలేజీ పెడతారు. ఆఖరికి అల్లూరి సీతారామరాజు పుట్టిన ఆగష్టు పదిహేను కూడా సెలవు ఇవ్వరు." గడగడ చెప్పుకుపోతున్నాడు రాజా. అతని వేగానికి అంతరాయం కలిగిస్తూ,

"బాబూ! సీతారామరాజు ఆగష్టు పదిహేనున పుట్టాడా?" బుర్ర వెర్రిగా గోక్కుంటూ అడిగాడు మూర్తి.

"ఓ! సారీ. ఆగష్టు పదిహేను రిపబ్లిక్ డే కదండీ! ఆయన పుట్టిన రోజే దయినా సెలవివ్వరు కదండీ....అందుకే గుర్తులేదు."

"డిసిప్లిన్ బాగుంటుందా?"

"దాంట్లో తిరుగులేదండీ! మా ప్రిన్సిపాలు ఈ కాలేజీ పెట్టకముందు బోఫోర్స్‌లో పనిచేశారు గదండీ! అందువల్ల మిలిటరీ డిసిప్లిన్ అంటే నమ్మండి."

"అంటే ఆయన....ఎయిర్ ఫోర్స్‌లో పని చేశాడనుకుంటా." ఆ కుర్రాడి జనరల్ నాలెడ్జికి ఉక్కిరి బిక్కిరవుతూ అన్నాడు మూర్తి.

"ఏదో ఒక ఫోర్స్... ఇక నే వెళ్తానండీ....చదువుకోవాలి" అంటూ మా ప్రతిస్పందన కోసం ఎదురుచూడవయినా చూడకుండా 'పిల్ల మరమనిషి'లా లోపలి కెళ్ళాడా కుర్రాడు....బెలిస్కోపు కటకాల్లా ఉన్న కళ్ళజోడుని సవరించుకుంటూ.

డబల్ టైఫాయిడ్‌తో లంకణాలు చేసిన రోగిలా అయిపోయిన మూర్తి ఆ రోజుకి విశ్రాంతి తీసుకుని, మర్నాడు సపుత్ర సమేతంగా తన అన్వేషణ కొనసాగించాడు. ఆటోలో 'పల్లవ రె.జూ.కా.'కి వెళ్లారు. అంతకు ముందు అక్కడ షుగర్ ఫ్యాక్టరీనో, ఎఫ్.సి.ఐ. గోడౌనో చూసిన జ్ఞాపకం మనసులో లీలగా మెదిలింది. లోపలికి ప్రవేశించగానే.... మొదటి రూంలోనే కాటి కాపరిలా కూర్చొని ఉన్నాడు సంపదరావు, కాలేజీ కరస్పాండెంట్.

"నమస్తే!" ఉపోద్ఘాతం వల్లించాడు మూర్తి.

"మంచిది. చేర్పించండి! అస్టలా? డే స్కాలరా? అస్టలయితే పదిహేను వేలు, డే స్కాలరయితే ఏడువేలు! టౌన్‌లో ఉన్న అన్ని రె.జూ.కా.ల కంటే మా దగ్గరే ఫీజులు తక్కువ. స్టేటస్ ఎక్కువ. ('స్టాండర్డ్'కొచ్చిన తిప్పలు!) కావాలంటే ఎవర్నయినా అడుక్కోండి!"

అసలే రేకుల షెడ్డు, దానికితోడు వేసవి పవర్‌కట్టూ....చెమటలు కక్కు తున్న మూర్తిముఖం అతని వాగ్ధాటికి పాలిపోయింది.

"ఓసారి కాలేజీ, హాస్టలూ చూడాలండీ!"

"దానికేం! చూడండి. ఒరేయ్ పుల్లాయ్! వీళ్ళకి మన కాలేజీ అంతా చూపించు."

కొడుకుని ఈడ్చుకుంటూ కదిలాడు మూర్తి.

క్లాసు రూముల్లో బెంచీల్లేవు. డైనింగ్ హాల్లో టేబుల్స్ లేవు. బాత్‌రూంలూ, టాయ్‌లెట్లూ అసలే లేవు. అసంతృప్తిగా కరస్పాండెంట్ రూంలో అడుగుపెట్టాడు మూర్తి.

"ఏం సార్! ఆర్ యు సాటిస్‌ఫ్యాక్టరీనా?" అడిగాడు సంపదరావు. కర్ణ కఠోరమైన ఆ ఇంగ్లీషు బూతు మాటల్లా వినిపించింది మూర్తికి.

"ఫరవాలేదనుకోండి....ఈ రేకుల షెడ్డు ఎండలకి వేడిగా వుంటుందేమో?"

"బిల్డింగుల్లో మాత్రం ఉడికిపోతుంట్లా?"

"అవుననుకోండి! బెంచీలూ గట్రా...."

"ఇక్కడవన్నీ ఉండవ్. మాది గురుకులం సెటప్పు."

"మరి బాత్‌రూంలూ, టాయ్‌లెట్లూ...."

"ఇరవై నాలుగ్గంటలూ నీళ్ళు పోసుకుంటా ఉంటారా పిల్లకాయలు? చెంబుడు నీళ్ళు ఏ పాయకాడ నిలబడి పోసుకుంటే సరిపోదూ? చుట్టూరా బోల్డంత మైదానం... టాయ్‌లెట్లతో పనేముందింక? అసలు పిల్లకాయలకి సదుపు కావాల్నా? సుఖాలు కావాల్నా? కష్టపడటంలో ఉండే సుఖం - శ్రమజీవన సౌందర్యం గురించి వాళ్ళని అనుభవ పూర్వకంగా తెల్సుకోనీండి. అన్ని రూములకీ ఏసీ పెట్టించగల్ను! ఏడాదికి ఒక్కొక్కరికి ముప్పై వేలౌద్ది. ఎంతమంది భరాయించుకోగల్రు. చెప్పండి!"

"అదీ నిజమే లెండి!" ముఖమాటంగా అన్నాడు మూర్తి.

"పిల్లకాయలకి సదువులు ముక్యంగానీ ఆడంబరాలూ, అంతస్తుల బిల్డింగులా ముక్యమా? మీలాగా సదూకున్న పేరెంట్సే కూడా పైపై మెరుగుల కోసం జూస్తే ఎట్టా? అయినా ఇదంతా టెంపరవరీ ఏర్పాటేలెండి. నెక్ష్టియర్‌కల్లా మీరడిగినయ్యన్నీ ఏర్పాటు చేయించనూ!"

"సరే! ఆలోచించుకుని మళ్ళీ వస్తానండీ!" అంటూ లేచాడు మూర్తి.

"బాగా ఆలోసిచ్చండి. ఇంటర్ కోర్స్ లాంటి (హతవిధీ!) టర్నింగ్ పాయింట్లలో తొందరపడి నిర్ణయాలు తీసుకోగూడదు. పిల్లకాయల బంగారంలాంటి ఫ్యూచర్ పాడౌద్ది. మీకు 'ది బెస్ట్' కావాలనుకుంటే మన పల్లవ రె. జూ. కా. ని మించింది కోస్తా బెల్టులో దొరకదు!" కొడుకు రెక్క పుచ్చుకుని దాదాపు పారిపోయి నంత వేగంగా వచ్చేశాడు మూర్తి.

నాలుగు రోజుల్లో లిస్టులో పదకొండు కాలేజీలు పూర్తయ్యాయి. ఆ రోజు పన్నెండో కాలేజీకి చేరారు ఉత్తమ 'తె.జా.రా.' అన్వేషకులు.

ఆ వీధిలోకి వెళ్ళగానే వరుసగా అయిదారు ప్రయివేటు భవనాలు సదరు కాలేజీ బోర్డులతో (కొత్త పెయింట్ వాసోలు!) కళకళలాడుతున్నాయి. వాటిలో ఏది ఆఫీసో, ఏది తరగతి గదులో, ఏది హాస్టల్ గదులో పోల్చుకోవటం కష్టంగా అనిపించింది. ఎంసెట్ పరీక్షలైపోవటంతోనూ, సదరు చదువుల ఫ్యాక్టరీ ప్రొప్రయిటర్ గార్ని ఇన్‌కంటాక్సు వాళ్ళు ఎడాపెడా దాడుల్తో వాయించెయ్యటంతోనూ భవనాలు ఖాళీగా ఉన్నాయి.

ఆలోచిస్తూ నిల్చుండగా, "సలాం సాబ్! క్యా చాహియే?" అతివినయపు నమస్కార మొకటి పడేస్తూ అన్నాడు గూర్ఖా.

వెళ్ళిన పని టూకీగా చెప్పి, కాలేజీ చూస్తానన్నాడు మూర్తి. అన్నిబిల్డింగులూ కలయతిరిగారు. వాటిలో ఒక బిల్డింగ్ ప్రహరీ పన్నెండడుగుల ఎత్తున విద్యుత్ తీగల ఏర్పాట్లతో సెంట్రల్ జైలులా కన్పించింది.

"దీనికి ప్రత్యేకంగా ఈ ఏర్పాట్లేమిటి?" ఆశ్చర్యాన్ని అణచుకోలేక అడిగాడు మూర్తి.

"ఇది ఎంసెట్ ఇంటెన్సివ్ కోచింగ్ వాళ్ళకి ప్రత్యేకం. ఫీజు యాభై వేలు! సీటు గ్యారంటీ స్కీము. రాకపోతే ఫీజు వాపస్."

"ఇప్పటివరకూ ఎంతమందికి వాపస్ ఇచ్చారు?"

"ఎందుకిస్తారు? ఒక రోజు ముందే ఎంసెట్ పేపర్లు వీళ్ళకి తెలుస్తాయి. వాటిని 'గెస్ పేపర్లు' అంటారు."

ఆ జైలు భవనం తప్ప మిగతా అన్నీ చూశాడు మూర్తి.

అన్నిట్లోనూ స్విచ్ బోర్డులు పీకివేయబడి వున్నాయి. వాష్ బేసిన్లూ, కిటికీల అద్దాలూ పగిలి ఉన్నాయి. గోడలకి సిరాతో పెయింట్ వేసినట్లున్నాయి. దొమ్మీనో, విధ్వంసమో జరిగినట్లుందా వాతావరణం.

"ఏమిటిలా వుంది?" ఆసక్తిగా అడిగాడు మూర్తి.

"ప్రతి సంవత్సరం ఇంతే! వెళ్ళిపోయే కుర్రాళ్ళు ఇలా చేసి వెళ్తుంటారు." చావు వార్తల్ని కూడా చిర్నవ్వుతో చదివే తెలుగు న్యూస్ రీడర్లా చెప్పాడు గూర్ఖా.

"ఎందుకలా చెయ్యటం?"

చెవిలో పూలకుండీ పెట్టుకున్నవాడ్ని చూసినట్లు మూర్తిని చూస్తూ, "సంవత్సరానికి పాతిక వేలు కట్టి, సౌకర్యాలకీ, తిండికీ ముఖం వాచిపోయిన పిల్లలు అంత కాక ఇంకేం చేస్తారు? సునో సాబ్! రేజీ బియ్యం పది రూపాయలైంది కదా! నా జీతం నాలుగొందలు. ఇంకో వంద పెంచమంటే....'నై' అంటారు. భగవాన్ దేఖ్తా నై క్యా?" కసిగా అన్నాడు వాచ్‌మేన్

చివరి భవనం దగ్గర ఒక రూముకి...."డాక్టర్ బోనీకపూర్, ఎముకల స్పెషలిస్ట్" అన్న బోర్డు వుంది.

"జూనియర్ కాలేజీకి ఎముకల స్పెషలిస్టు అవసరమేమిటి?" అర్థంకాక అడిగాడు మూర్తి.

"సాబ్! ఇక్కడ ప్రతి క్షణం చదవాల్సిందే! చదవకపోయినా, ఆటలు ఆడినా మా బిగ్ సాబ్ 'టాంగే' (కాళ్ళు) తుంచేస్తారు. వాళ్ళకి కట్లు కట్టేందుకు ఇక్కడే ఎముకల డాక్టర్ ఉంటాడు. అందుకయ్యే బిల్లు స్టూడెంట్‌కే ఏస్తారు!" మేడిపండును పూర్తిగా విప్పాడు గూర్ఖా.

0 0 0

గుండెలమీద కుంపటిలా తయారయిన కొడుకు చదువు సమస్య తీరక నిస్పృహాగా ఉన్నారు మూర్తి దంపతులు.

"చూడు నాయనా! ఏ 'రె.జూ.కా.'లూ మన స్వంత ఇంటిలా ఉండవు. ఉన్న వాటిలో తక్కువ చెడ్డదాన్ని ఎంచుకుని....ఓ రెండేళ్ళు సర్దుకుపోతే....నీకు బంగారు భవిష్యత్తు ఏర్పడుతుంది. నా మాట విను కన్నా!" కొడుకుని బుజ్జగిస్తోంది తల్లి.

శ్రీకాంత్ మాట్లాడలేదు. క్షణాలు గడుస్తున్నాయి.

"ఏమిట్రా? అలా బెల్లం కొట్టిన రాయిలా నిల్చుంటే ఎలా? ఏదో ఒకటి తేల్చి తగలడు!" అసహనంగా అరిచాడు మూర్తి.

నెమ్మదిగా తల్లి దగ్గరకు చేరాడు శ్రీకాంత్.

"అమ్మా! నేను 'రె.జూ.కా.'లో చదవాలంటే కనీసం నలభై వేలవుతుంది కదా ?" అన్నాడు.

"తల తాకట్టు పెట్టయినా ఆ తిప్పలేవో మేం పడతాం. ఖర్చు గురించి నీ కెందుకురా చిట్టి తండ్రీ?"

"అది కాదమ్మా! ఆ నలభై వేలూ నాకు ఇప్పుడు ఇచ్చెయ్యకూడదూ?"

"ఏమిటి? రూపాయలే! ఎందుకురా అంత డబ్బు?" సీరియస్‌గా అరిచాడు మూర్తి.

"'రె.జూ.కా.'లో చేరటానికాదు నాన్నా!"

"మరి?"

"నేనే ఓ రెసిడెన్షియల్ జూనియర్ కాలేజ్ పెడతాను." తాపీగా అన్నాడు శ్రీకాంత్.

కొడుకు 'షేర్ బ్రోకర్' తెలివితేటలకి స్థాణువై పోయాడు మూర్తి.

0 0 0

టెస్ట్‌ట్యూబ్ బేబీలకి పెళ్ళొచ్చిన శాస్త్ర యుగంలో పుత్రకామేష్టి యాగాలు జరుగుతున్న దేశంలో.... →

# మూసీ సాక్షిగా -

నాకు చదువొక యజ్ఞం
నాకు జీవితం నిత్యగండం
మా నాన్న చేతిలో / రాగాలు పలికిన నాగలి
నా గుండె లోపలి శిలాజమవుతుంది
మా అమ్మ కొట్టిన / పిడకల గుర్తులు
ఇంటి ముందు గోడపై శిధిలాలవుతాయి
మెట్టి నింట్లో మాచెల్లె
కత్తిమొన మీద రాలిపడిన
కృష్ణశాస్త్రి కవితాపుష్పమవుతుంది
నండూరి ఎంకి సాక్షిగా ప్రేమించిన
నా హృదయదీపం / చెప్పా పెట్టకుండా జారుకుంటుంది
ఇపుడు - నా పల్లెకు నేను అపరిచితుడ్ని
నా పల్లెకు నేను బహిష్కృతుడ్ని
మట్టి పిసికే చేతులు / నాకు దూరంగా జరుగుతాయి
నా చదువు / తెలివైన శిల్పిచేతిలోని
మొండివారిన ఉలి అవుతుంది

—కాసుల ప్రతాపరెడ్డి

---

→ విజ్ఞాన శాస్త్ర ఫలమైన టీ.వీ.ల్లో ముక్కోటి దేవతల ఉత్సవాలు 'లైవ్ టెలికాస్ట్'లు రంగుల్లో దర్శనమిస్తున్న దేశంలో....

సేవా తత్పరత లక్ష్యం కావల్సిన వైద్య రంగం ఫైవ్ స్టార్ వైద్య కేంద్రంగా రూపాంతరం చెందిన దేశంలో....

విద్యావేత్తల పర్యవేక్షణలో ఉండాల్సిన విద్య....పెట్టుబడిదారుల చేతికి వెళ్ళిపోయిన నేపథ్యంలో....

తల్లి భారతీ! పేదరికమే పంచ ప్రాణాలుగా పెరుగుతున్న కోట్లాది నీ బిడ్డల భవిష్యత్తేమిటి ?

తల్లిదండ్రులూ! విద్యని ప్రయివేటు పరం చేసి చేతులు దులుపుకుంటున్న ప్రభుత్వాల నిర్లక్ష్య ధోరణిని....ఎన్నాళ్ళిలా సహిస్తారు?

దయచేసి ఆలోచించండి !

(విద్యను వ్యాపారం చెయ్యాని వారికి అభినందనలతో.—రచయిత)

# జాతీయ ముస్లిం విశ్వవిద్యాలయంలో మతతత్వ వికారాలు

1920 ప్రాంతాల్లో స్వాతంత్రోద్యమంలో భాగంగా జాతీయ, ముస్లిం విశ్వవిద్యాలయం పాల్గొనడానికి నిరాకరించగా, దానిలోవున్న జాతీయవాదులు, ఆదర్శవాదులు ఆ విశ్వవిద్యాలయం నుంచి బయటకువచ్చి దీన్ని స్థాపించారు. మేధావులైన జాకిర్ హుస్సేన్, అన్సారీ, ఎ.ఎమ్. అష్రాఫ్, మహమ్మదాలీల పర్యవేక్షణలో ఈ విద్యాసంస్థ సాగింది. రెండు జాతుల సిద్ధాంతాన్ని వ్యతిరేకించింది. ఇండియాలో విభిన్న జాతుల జాతీయత వుండాలంది.

ఇంత ఉదాత్త చరిత్ర కల్గిన 72 సంవత్సరాల వయసుగల ఈ విశ్వవిద్యాలయం మొన్న ఏప్రిల్ 30న మూసివేయాల్సి వచ్చింది. కారణమేమిటంటే ఆ విశ్వవిద్యాలయ ప్రో వైస్‌ఛాన్సలర్ అయిన ముషిరుల్‌హసన్, 'సండే' వారపత్రిక వారితో మాట్లాడుతూ (18-4-1992 సంచిక) "సాల్మన్ రుష్దీ నవల 'సాటానిక్ వెర్సస్'పై నిషేధం ఎత్తివేయాలి. ఎవరి అభిప్రాయాలకూ, భావాలకూ సంకెళ్ళు విధించరాదు-అయితే ఆ పుస్తకంలోవున్న అభ్యంతరకరమైన విషయాలను తర్కబద్ధంగా ఎండకట్టండి. రుష్దీభావాలతో నేను ఏకీభవించడంలేదు" అని అన్నారు.

ఇందిరాగాంధీ జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో 1992 ఫిబ్రవరిలో జరిగిన ఒక గోష్ఠిలో ఆయన సమర్పించిన వ్యాసంలో సాల్మన్ రుష్దీ ప్రవక్త మహమ్మద్‌ను ఏవిధంగా కించపరిచాడో, ముస్లిం వీరులను ఏవిధంగా హేళనచేశాడో ముస్లిం మతస్థులను గాయపరచడానికీ, రెచ్చగొట్టడానికి ఎటువంటి ప్రతీకలు కావాలని ఏరికోరి ఉపయోగించాడో చెప్పి రుష్దీని ఏకిపారేశారు.

నిషేధంవల్ల నిషేధింపబడిన పుస్తకంపట్ల ఆసక్తి పెరుగుతుంది. దానికంటే ముస్లిం సంప్రదాయమేమిటంటే ఆ పుస్తకాన్ని తర్కబద్ధంగా తిరస్కరించడం - ఎండగట్టడం. గతంలో విలియం మ్యూర్ రాసిన పుస్తకానికి సర్ సయ్యద్ అహమద్‌ఖాన్ సమాధానం ఇచ్చారు. ఇస్లాం పై క్రిస్టియన్ మిషనరీల సైద్ధాంతిక దాడిని అమీర్ అలీ త్రిప్పికొట్టారు. ముస్లిం మేధావుల సంప్రదాయం ఇది.

అయితే విశ్వవిద్యాలయంలోని మతతత్వ విద్యార్థుల ముఠా హసన్ వెలిబుచ్చిన ఈ అభిప్రాయాలన్నీ పరిశీలించకుండా ఆందోళనకూ, అల్లర్లకూ దిగింది. ఏప్రిల్ 23 నుంచీ ప్రారంభమైన ఆందోళన ఫలితంగా ప్రో వైస్‌ఛాన్సలర్ హసన్ తన భావాలు కొందరిని గాయపరచినందుకు విచారం ప్రకటించారు. హసన్ రాజీనామా చేయాలని పట్టుపట్టగా మే 1న విశ్వవిద్యాలయం మూసివేసారు.

మతతత్వం, కులతత్వం తలకెక్కితే తర్కం, హేతుబద్ధత గాలి కెగిరిపోతాయని ఈ సంఘటన రుజువు చేస్తోంది. —ఆర్.వి. వర్మ, విజయవాడ.

# అనాథ బాలల యథార్థ దృశ్యం 'భద్రం కొడుకో'

— పరజ

ఈ మధ్య ఏ పత్రిక తిరగేసినా ప్రధానంగా ఒక విషయం పదే పదే దృష్టి కొస్తుంది. మంచి సినిమాలు చూసేవాళ్ళకి, అభిమానించే వాళ్ళకి అశనిపాతంలా తాకిన సత్యజిత్ రే నిష్క్రమణం గూర్చి, ఆయన తెచ్చిన అవార్డులను గూర్చి, ఆయన సినిమాలను గూర్చి అన్ని పత్రికలూ అనర్గళంగా రాసేయి-'సినిమా అంటే ఇట్లా వుండాలి', 'సినిమాల్లో వాస్తవికత అంటే ఇది', 'సినిమా జీవితాన్ని ఇట్లా ప్రతిబింబించాలి' అంటూ భారతీయ సినిమాకు కొత్త అర్థాలు చెప్పి, కొత్త దారులు వేసాడు రే. నాటకాల శిథిలావశేషాల్తో, మెలోడ్రామాలతో, అవాస్తవిక సన్నివేశాలతో, పాటలూ డాన్సులతో, కృత్రిమ విలువలతో, తక్కువ స్థాయి సాంకేతిక విలువలతో కొట్టుమిట్టాడుతున్న సినిమాకు కొత్త వెలుగునూ, కొత్త రూపురేఖలనూ, పయనించడానికి కొత్త మార్గాన్నీ అందించింది నిస్సందేహంగా సత్యజిత్ రే. అయితే ఆయనే వప్పుకున్నట్టుగా ఆయన కంటే గొప్పగా సినిమాలు తీసి, తన సినిమాల్లో అద్భుతమైన కవిత్వాన్నీ, ఆవేశాన్నీ, మహోన్నత విలువలనీ చాటి చెప్పింది రిత్విక్ ఘటక్. రిత్విక్ ఘటక్ తన జీవితంలోని విశృంఖలత్వం వల్ల అకాల మరణానికి గురవడం విషాదకరం.

అయితే 'భద్రం కొడుకో' సినిమాని రివ్యూ చేస్తూ సత్యజిత్ రే గూర్చి, ఘటక్ గూర్చి ఎందుకూ మాట్లాడుకోవడం? భారతదేశంలో బెంగాల్ తర్వాత రాజకీయంగానూ, సాంస్కృతికంగానూ అంత చైతన్యంతో ఎగసిపడేది ఆంధ్ర ప్రదేశ్ అని చెప్పుకోవచ్చు. బెంగాల్‌లో వచ్చిన నక్సల్‌బరీ ఉద్యమం రాజకీయంగా ఆంధ్రాలో శ్రీకాకుళం, గోదావరిలోయ, కరీంనగర్ లాంటి రైతాంగ ఉద్యమాలకి ప్రేరణ నిచ్చినయి, వుత్తేజాన్నిచ్చినాయి, కొత్త దారులు చూపినాయి. సాహిత్యంలోనూ మనం ఏమీ తక్కువకాదు. చెప్పుకోవాలంటే బెంగాలీలు ఎక్కువే కూడా! అయితే మనం ఇప్పటికీ సిగ్గు పడాల్సిందీ, విషాదంగా చెప్పుకోవాల్సిందీ-మనకు మంచి సినిమాలు, నవ్య సినిమాలు అనేవి దాదాపుగా ఏమీ లేవనే! ఇది బాధాకరమైన పరిస్థితే అయినప్పటికీ దీని వెనుక ఆర్థిక కారణాలు, మార్కెట్ సంబంధాలు వున్నయ్యనేది వాస్తవం. అయితే ఇప్పుడు చేసేది ఈ చర్చ కాదు. తెలుగులో వస్తున్న వ్యాపార సినిమాల బురద ప్రవాహం మధ్య అప్పుడప్పుడయినా కొన్ని ఆశారేఖ లగుపించినయి. 'మా భూమి', 'రంగుల కల', 'దాసి', 'మట్టిమనుషులు'

లాంటిఆశారేఖలు (వాటి బాగోగు లెట్లున్నప్పటికిన్నీ) తెలుగులోనూ మంచి సినిమా రావచ్చేమోనన్న ఆశ మనసులో చిగిర్చింది. 'భద్రం కొడుకో' ఆ ఆశను మరింత బలోపేతం చేస్తోంది. నిస్సందేహంగా 'భద్రం కొడుకో' తెలుగులో వచ్చిన పిడికెడు మంచి సినిమాల సరసన చేర్చాల్సిన సినిమా. అందుకు ఈ సినిమా నిర్మాణంలో పాలుపంచుకున్న అందరూ అభినందనీయులే.

అయితే ఒక సినిమాను 'బాగుంది-బాగుంది' అని సర్వత్రా వినబడే పొగడ్తలతో ముంచెత్తితే సరిపోదు. అట్లా చేయడం మరో మంచి సినిమా రావడానికి దోహదం చేస్తుంది. సోకాల్డ్ 'ప్రధాన స్రవంతి' వ్యాపార సినిమాల్లో కలవని ఆణిముత్యాల్లాంటి సినిమాలను నిశితంగా, నిర్మాణాత్మకంగా, పాజిటివ్‌గా విమర్శిస్తే దానివల్ల కొత్త కోణాలూ, ప్రయోజనాలూ వెలుగు చూస్తే అది నవ్య సినిమాకు ఎంతో శక్తినీ, ఉత్తేజాన్నీ ఇవ్వగలుగుతుంది.

'భద్రం కొడుకో' లోని లోపాలేమిటి? పాజిటివ్ అంశాలేమిటి? ఎట్లా తీసి వుంటే, తీయగలిగి వుంటే 'భద్రం కొడుకో' గొప్ప సినిమా కాగలిగేది? ముందుగా 'భద్రం కొడుకో' లోపాలు పరిశీలించిన తర్వాత దాని సుగుణాలు చూడటం అసమంజసమేమీ కాదనుకుంటాను.

మొట్టమొదటిగా ఏ సినిమాకయినా అత్యంత అవసరమైంది ఒక థీమ్. ఆ థీమ్‌ని అద్భుతంగా ప్రతిఫలించగలిగే ఒక బలమైన కథ. 'భద్రం కొడుకో'కు నిస్సందేహంగా ఒక మంచి థీమ్ వుంది. బాలల గూర్చి, అనాథఅయిన బాల్యం గూర్చి, బాల కార్మికుల గూర్చి, వారి పట్ల ప్రభుత్వ బాధ్యతా రాహిత్యం గూర్చి చెప్పడం 'భద్రం కొడుకో' ఉద్దేశ్యం. అయితే బాధాకరమైందల్లా ఏమిటంటే ఈ థీమ్‌కి గొప్పగా, ప్రతిభావంతంగా ప్రొజెక్ట్ చేయగలిగే బలమైన కథను సినిమాకు ప్రాణంగా ఎన్నుకోకపోవడం. వాస్తవంగా 'భద్రం కొడుకో'కు రేఖామాత్రంగానయినా ఒక కథ లేదు. కొన్ని సంఘటనలనూ, దృశ్యాలనూ పూసగుచ్చితే అది కథ కాబోదు. అసలు నవ్య సినిమాకు, వాస్తవికత కద్దం పట్టే సినిమాకు కథ అనవసరమంటే అది ఫీచర్ ఫిల్మ్ కాబోదు. డాక్యుమెంటరీ అవుతుంది. ఏ నవ్య సినిమా దర్శకుడు ఎంత ప్రతిభావంతుడయినా కథ లేకుండా సినిమా తీసే సాహసం చేయలేదు. (చివరికి ఎవరికీ అర్థం కాకుండా సినిమాలు తీసే మణి కౌల్ కూడా దోస్తోయేవ్‌స్కీ కథ నాధారంగా సినిమా తీసాడు. కవితాత్మకంగా అద్భుత దృశ్యాలు సృష్టించే అరవిందన్ సినిమాల్లోనూ కథ అంతర్లీనంగా వుంటుంది, 'కాంచనసీత'కు రామాయణం మూలకథ, 'పొక్కువెయిల్'కు డిన్ యువకుడి పరాయీకరణని ప్రతిఫలించే జీవిత కథ మూలం). అటువంటిది 'భద్రం కొడుకో' ఒక కథ లేకుండా ఎట్లా నిలవగలదు? ఒక బలమైన కథ ఆధారంగా అల్లుకుపోయే సంఘటనలూ, వాటి ప్రతిభావంతమైన కథనమూ సినిమాకు ప్రాణం పోస్తుంది. ఉత్కంఠత రేపే

కథలే కావాలని కాదు. బలమైన కథ, శక్తివంతమైన స్క్రీన్‌ప్లే అందుకు ఆధార మవుతాయి. స్క్రీన్‌ప్లే శక్తివంతంగా లేనిదే ఏ సినిమా ఐనా సరే (చివరికి అదో చెత్త వ్యాపార సినిమా ఐనా సరే) నిలవలేదన్నది వాస్తవం. విషాదకరమైన అంశ మేమంటే 'భద్రం కొడుకో'కి ఓ మంచి స్క్రీన్‌ప్లే కరువయింది. ఒక దృశ్యం తర్వాత దృశ్యం ఏమిటో దర్శకుడే గందరగోళంలో పడి హఠాత్తుగా ఓ పాటో, మరో అసంబద్ధ సన్నివేశమో 'ఇరికించడం' 'భద్రం కొడుకో'లో అగుపిస్తుంది. ఇది ఖచ్చితంగా సినిమాలో కథా లోపమే. తర్వాత ప్రధానాంశం పాత్రల చిత్రీ కరణ (charecterisation). ఇది నిస్సందేహంగా మంచి కథ నుండీ, మంచి స్క్రీన్‌ప్లే నుండీ ఆవిర్భవించేదే! సత్యజిత్ రే వాస్తవికత కద్దం పట్టే సినిమా లని నిర్మించి మనకు నేర్పిన గొప్ప పాఠం ఇదే. రే సినిమాల్లో ఏదిన్నూ ఒక గొప్ప కథ లేందే, దాన్నాధారం చేసుకొని పకడ్బందీగా స్క్రీన్‌ప్లే లేనిదే తద్వారా ఆవిర్భవించే బలమైన పాత్రల చిత్రీకరణ లేందే వచ్చినవి కావు. అవి అంత శక్తి వంతం కావడానికి రే ఎన్నుకొన్న గొప్ప కథలూ, వాటిని ఆధారం చేసుకొని రాసు కున్న పకడ్బందీ స్క్రీన్‌ప్లేలూ, పాత్రల చిత్రీకరణ (ఇదీ రే నే చేసేవాడు) ప్రధాన కారణం. తర్వాత వచ్చేవి రే తన స్వంత బాణీలో ఏర్పరుచుకున్న టేకింగ్ పద్ధతీ, తాను భారతీయ సినిమాకు నేర్పిన షాట్ డివిజన్, సన్నివేశానికి సందర్భోచితంగా వాడుకున్న అద్భుత సంగీతమూ, ఫొటోగ్రఫీ వగైరా గొప్ప సాంకేతిక విలువ లున్నా! ఒక ఇంటర్వ్యూలో రే వీటిని గురించి ప్రస్తావిస్తూ ఇవేవీ సినిమాకి అవసరం కన్నా ఎక్కువగా వుండడం సరయింది కాదంటాడు. ఆయనే ఎన్నో సార్లు వీటిని క్లుప్తంగా వాడుకున్న సైనం మనం గమనించవచ్చు! 'భద్రం కొడుకో' చూసేక 'అయ్యో! ఇంత గొప్ప థీమ్ ఇంత కథారాహిత్యానికీ, తద్వారా సంభవించే అనేకానేక లోటుపాట్లకూ గురయిపోయిందే' అని బాధేస్తుంది.

ఇందులోని బాలల పాత్రలకు వేటికీ బలమైన పునాది లేకపోవడం, అవేవీ జీవితంలోంచి ఒక పరిణామ క్రమంలో కాకపోవడం (ఒక్క శ్రీను పాత్ర తప్ప, అదీ అంత గొప్పగా సృష్టించబడలేదు.) వాటి తర్వాతి జీవిత క్రమాన్ని, పరిణామ క్రమాన్ని ఎస్టాబ్లిష్ చేయడంలో వైఫల్యానికి మూలకారణం. ఎంతో ఏంబిషస్ క్యారెక్టర్ ఐన యాదగిరి పాత్ర (దీన్ని సంతోష్ అద్భుతంగా పోషించేడు) ఆవిర్భా వాన్ని, గమనాన్ని, చివరికి అంతాన్ని సరిగ్గా నిర్దేశించలేకపోవడం కొట్టొచ్చినట్టు కనబడే లోపం. అట్లే మరో ప్రధాన పాత్ర మల్లి. దీనికి సరిమైన పాత్ర చిత్రణ లేదు. ఇట్లా సినిమాకు ప్రాణం పోయాల్సిన పాత్రలు, సినిమాని నడిపించాల్సిన పాత్రలు, సినిమా గమనాన్ని ఓ సరియైన మార్గంలో పెట్టాల్సిన పాత్రలు దెబ్బ తినడం సినిమాకే ప్రధాన లోపం. సినిమాలో అగపడే పెద్దవాళ్ళ పాత్రలన్నీ అసంబద్ధంగానే వున్నవి. హోటల్ యజమాని పాత్ర, సత్తెమ్మా, ఆమె ఎంపు

కున్న పురుషుడూ, మెకానిక్కూ, సత్యం మేష్టారూ, రౌడీ-ఇలా చెప్పుకుంటూపోతే పెద్దవాళ్ళ పాత్రలకూ న్యాయం చేయలేదు-మరీ సత్తెమ్మ పాత్ర. ఇందులో సినిమా తీసినవాళ్ళ స్వంత వైఖరి కూడా వున్నట్టు కనబడుతుంది. ఆమె జీవితం ఆమె ఎంచు పని ఆమెకి తోచినట్టు జీవిస్తే ఆమె కూతురు గతేమిటి? అట్లా అంటే ఈ సినిమాకు ప్రాణమైన అనాథ బాల కార్మికులందరి కుటుంబాల్లో చెలరేగే అనేకానేక సంక్షోభాలకు (ఇవి సమాజంలోని ఆర్థిక సంక్షోభాన్ని ప్రతిఫలిస్తూ వుంటాయి) పర్యవసానంగా సృష్టించబడ్డవారే! వారు బాల్యం కోల్పోయిందీ, వారి జీవితాలట్లా తయారయిందీ-వీటికి కారణం-వారి జీవితాలకూ, తల్లిదండ్రుల జీవితాలకూ వున్న అనేకానేక వైరుధ్యాల ఫలితం కాదా! వైరుధ్యాలని పరిష్కరించే సమయంలో వాటి మధ్య సంఘర్షణే కాదు Unity and integrity కూడా వుంటాయనీ మర్చిపోరాదు. సత్తెమ్మ తన జీవితాన్ని తానే బ్రతకాలనుకోవడం తన మేరకు తన వైరుధ్యాలని పరిష్కరించుకోవడం ఐతే కావచ్చుగాని తనతో ముడివడివున్న చిన్నారి జీవితానికి సంబంధించిన వైరుధ్యం మాటేమిటి? ఆ అమ్మాయలా వదిలేయబడాల్సిందేనా! మరయితే ఇతర బాల కార్మికుల గూర్చి మన ఆందోళన మాటేమిటి? వారి పరిస్థితులకు దారితీసిన తల్లిదండ్రుల బాధ్యతా రాహిత్యం మాటేమిటి? ఇది పాక్షికమే ఐనా దాన్ని నిర్లక్ష్యం చేయగూడదు కదా! ఈ వాదనను (సత్తెమ్మకు సంబంధించిన దాన్ని) ఇట్లా పొడిగిస్తే సినిమా మూలమే దెబ్బతింటుంది. బాల కార్మికుల పరిస్థితికి సమాజమూ, ఆర్థిక వ్యవస్థా, ప్రభుత్వమూ కారణాలే-బాలల్ని విచక్షణా రహితంగా దోచుకునే దోపిడీదార్లూ కారణమే! కానీ వీటినీ 'భద్రం కొడుకో' సమర్థవంతంగా ఎత్తిచూపలేదు - మళ్ళీ దీనికి చర్విత చర్వణంగా కథా లోపమే కారణం! కొంత అవగాహనా లోపం కూడా.

ఇట్లా సినిమాలో అనేక అంశాలు ఒకేచోట పొంతన లేకుండా కనపడ్డంవల్ల కూడా సినిమా తన శక్తిని కోల్పోయింది. రైల్వే స్టేషన్లలో అడుక్కునే బాలలు, పనిచేసే బాలలు, దోపిడీ చేయబడే బాలలు, అనాథలు, పిచ్చిదాని వృత్తాంతం-అనేకం సినిమాలో హృద్యంగా చిత్రీకరించబడ్డప్పటికీ (ఇందులో మొదటిదాన్ని కొంత చిత్రంగా చూపించారు- ఒక బాలుడు అడుక్కుంటూంటే మిగతా వాళ్ళంతా నవ్వడం, ఆట పట్టించడమేమిటి?) ఈ దృశ్యాలు ప్రేక్షకుల్లో మొత్తంగా ఒక ప్రభావం సృష్టించడంలో విఫలమయ్యాయి. కారణం మొత్తం చిత్రంతో కలిపి వీటిని చూస్తే ఎటువంటి పాజిటివ్ గుణమూ కన్పడదు. ఒక బలమైన కథ లేకపోవడమే దీనికి కారణమని వేరే చెప్పనక్కర్లేదు.

సినిమాలో ఫొటోగ్రఫీ, సంగీతం-ముఖ్యంగా ఫొటోగ్రఫీ అద్భుతం. మధు అంబట్ పిల్లల వివిధ మూడ్స్‌ని గొప్పగా పట్టుకున్నాడు. ఫ్రేములను ఎన్నుకోవడంలో, షాట్స్‌ను రూపొందించుకోవడంలో దర్శకుడు మంచి ప్రతిభనే కన →

---

→ పర్చాడు. మాటలు బలంగానే వున్నాయ్. కొన్నిచోట్ల సంతోష్ తన బలమైన వ్యక్తీకరణతోనూ, బలమైన డైలాగ్స్‌తోనూ కంటతడి పెట్టించాడు. పాటలు కొన్ని అసంబద్ధత వల్ల, కొన్ని సరిగ్గా పాడలేకపోవడం వల్లా అంతగా ప్రభావం కలిగించ లేదు. 'తల్లీ కావాలి మాకు' మంచి పాట. హెచ్చార్కె పాటను సరిగా పాడలేదు. సరిగ్గా పిక్చరైజ్ చేయలేదు. బంప్ రోజు పాట అసంబద్ధం.

ఇట్లా చెప్పుకుంటూ పోతే రంధ్రాన్వేషణ అయ్యే ప్రమాదమూ వున్నది. అయితే ఇన్ని లోపాలున్నప్పటికీ, 'భద్రం కొడుకో' నిస్సందేహంగా తెలుగులో వచ్చిన మంచి సినిమాల్లో ఒకటి. ఒక చిరకాల సమస్యను ఎంతో బలంగా ముందుకు తెచ్చి మనందరినీ చిన్నారుల గురించి ఆలోచించమని ప్రేరేపించింది సినిమా. ఈ సినిమా చూస్తున్నపుడు అనాథ బాలల గూర్చి కంట తడి పెట్టనివారు అరుదు! చూసాక అట్లాంటి బాలలు తటస్థిస్తే తమ పూర్వపు దృక్పథంలోనూ, ప్రవర్తనలోనూ మార్పు చూపనివారు ఇంకా అరుదు. ఇది తప్పకుండా సినిమా సాధించిన ఒక మంచి విజయం. అయితే మనం సినిమా నిర్మించడంలో ఇంకా ఎంతో నేర్చుకో వాల్సి వున్నది అనేది స్పష్టమవుతోంది. మరీ ముఖ్యం కుటుంబరావు, [illegible] లాంటి మంచి కథకులు సినిమా తీస్తున్నపుడు ఎంతో ఆశించడం సహజం కదా!

# ఎందుకు ఈ చదువులా ? ఎన్నాళ్ళీ చదువులా

ఎందుకు యీ చదువులా?
ఎన్నాళ్ళీ చదువులా?
బ్రతుకు బాట చూపలేని
గతిమాలిన చదువులా!
బ్రతుకు తీర్చిదిద్దలేని
మతిమాలిన చదువులా! ॥ఎం॥
చదువున కర్థం తెలియని
చచ్చు పుచ్చు చదువులా
అర్థం పరమార్థమనే
బుద్ధిహీన చదువులా ॥ఎం॥
సాటి మనిషి శ్రేయస్సుకు
సాయపడని చదువులా
సామాజిక పురోగతికి
ఊపిరవని చదువులా ॥ఎం॥
ఫేషన్లకు బానిసలుగ
విష సంస్కృతి పోషకులుగ
అవినీతికి ఆశ్రితులుగ
అరాజకం పురుగులుగా
తీర్చి దిక్కు చదువులా
విషం కక్కు చదువులా ॥ఎం॥
ఎన్నాళ్ళో చదివి చదివి
ఎంతెంతో ధారపోసి
ఇల్లు ఒళ్ళు గుల్లచేసి
పట్టభద్రులైన గాని
పొట్టపోసె కరువాయే
పట్టాలే దక్కెనాయె
బ్రతుకంటే భయం భయం
మనకంటే శవం నయం- ॥ఎం॥

చదివేదా ఒక చదువా
చేసేదా మరో కొలువు
నేర్పు లేని రంగంలో
మనసులేని ఉద్యోగం
ఆశలు అడియాస లవగ
బ్రతుకు తెగిన గాలిపటం
నిరాశలో, నిస్పృహలో
యువతరాల బ్రతుకు హతం
మన పైనే మనకు లేదు
లేశమైన విశ్వాసం
సుఖశాంతులకా దూరం
మనకు మనమె పెను భారం
కర్మవాద బానిసలై
బ్రతుకు లీడ్చు జీవాలం
జీవమున్న శవాలం
మన కళ్ళకు చూపు లేదు
మన కాళ్ళకు బలం లేదు
మన నడకకు జవం లేదు
మన మెదడుకు తీరు లేదు
ఈ చదువులకే శత్రువు
శ్రమ జీవన సౌందర్యం
ఈ చదువులకా గిట్టదు
శ్రమ సభ్యత సంస్కారం
ఈ చదువులకా శూన్యం
సామాజిక చైతన్యం
ఈ చదువుల పరమార్థం
హద్దులు చెరగిన స్వార్థం

(తరువాయి 32 వ పేజీలో)

# బడ్జెట్

-విద్యాసాగర్

అందరూ ఆ రోజుకోసం ఎంతో ఉత్కంఠతతో ఎదురు చూస్తున్నారు. ఎదురు చూస్తున్న రోజు రానేవచ్చింది. ఆర్థిక మంత్రి 'సమ్మోహనరావు' పార్లమెంట్‌లో బడ్జెట్ ప్రవేశపెట్టబోయే రోజు అదే!

వామపక్షనేత భీమనాథ్, ఇహనా 'సెక్యులరిజాన్ని' వ్యతిరేకించే 'అధ్వాన్నరావ్'లు బడ్జెట్ ప్రవేశపెట్టిత ఏమంచే ఏవిషయాల్లో రాజీపడాలో, ఎక్కడ ప్రజల్ని 'రెచ్చగొట్టాలో', ఎలా రెచ్చగొడితే ప్రభుత్వానికి నష్టం కలగదో అనే కూడికలు, తీసివేతల్తో తర్జన, భర్జనలు పడుతున్న తరుణమది.

దేశవ్యాప్తంగా టీ.వి.లు ముందేసుకుని 'మధ్యతరగతి' వాళ్ళు, షేర్స్ ఎలా పెరుగుతాయోనని పారిశ్రామిక వేత్తలు, 'బడ్జెట్' అంటేనే అంచనాలేని సామాన్యులతో దేశంలో ఒక రకమైన ఉద్విగ్న వాతావరణం నెలకొందనేది స్పష్టం.

ఆర్థిక మంత్రి సమ్మోహనరావు బడ్జెట్ చదవడం ప్రారంభించారు. యథావిధిగా ప్రశంసల, విమర్శల జల్లులు కురిసాయి. అది 'మరేదో హస్తం' సాయంతో తయారైందని, 'కాదు....కాదు స్వదేశీహస్తమే' అని వీరు వాదులాడుకోవడం ప్రారంభించారు. దీనికి వ్యతిరేకంగా ప్రజల్ని ఆందోళనకు కదిలిస్తామని ప్రతిపక్ష నేతలు భీమనాథ్, అధ్వాన్నరావులు ధీరగంభీరంగా ప్రకటించారు. ప్రజల ఆందోళనలకు కదిలించేందుకు 'ప్లాన్స్' కూడా వేసారు. యథావిధిగా ప్రజలు బడ్జెట్ పెంచిన ధరలు తగ్గించాలని, కనీస వసతులు కల్పించాలని, విదేశీ దోపిడి నశించాలని నినాదాలు చేశారు. పోలీసులు రంగప్రవేశం చేసి లాఠీలు, తూటాలు ప్రయోగం చేశారు. నాయకులు చర్చలకై సమ్మోహనరావుతో భేటీఅయ్యారు. వివిధ సమస్యలపై అంగీకారం కుదిరిందన్న తర్వాత ప్రజల్ని ఉద్దేశించి నాయకుల ప్రసంగం ఈ క్రింది విధంగా సాగింది.

“ప్రజలారా! ఆర్థిక మంత్రితో మనం చేసిన చర్చలు ఫలప్రదంగా ముగిసాయని చెప్పటానికి సంతోషిస్తున్నాం. ఇదంతా మేం మీకోసం రక్తాన్ని సహితం చిందించి సాధించిన విజయం ! ప్రజల నిత్యావసర వస్తువుల ధరలు తగ్గించాలని మేం చేసిన ప్రధానమైన డిమాండ్‌ను గౌ॥ సమ్మోహనరావుగారు దయతో అంగీకరించి, అందులో భాగంగానే 'బంగారం', 'వజ్రాల'కు సబ్సిడీలు కల్పించి ధరలు తగ్గించాలని నిర్ణయించారు. ఆదేసమయంతో పై లోటును ఎరువులు, పురుగు మందుల ధరలు పెంచడం ద్వారా భర్తీ చేసేందుకు మనం అంగీకరించాం” అంటూ ఉపన్యాసాన్ని ముగించారు.

# స్నాతకోత్సవం

విశ్వ విద్యాలయ పరిశ్రమ
పట్టా కాగితాలను ఉత్పత్తి చేసే
హీనస్థితికి చేరుకుని
వస్తు మారకం జరగక, సంక్షోభంలో పడింది
ఏడాది కోసారి స్నాతకోత్సవాల పేరిట
పి.జి. పట్టాలతో
గౌరవ డాక్టరేట్లతో
అవినీతి కుంభ కోణాలతో
సాంవత్సరీకం అతివైభవంగా చేస్తోంది
మనమిక చేయాల్సింది
జీవం లేని విద్యా వ్య(అ)వస్థకు
పెద్ద కర్మచేసి రెండు నిమిషాలు మౌనం పాటించటం,
మనమింక నేర్వాలిసింది
విశ్వ విద్యాలయాలను విప్లవ కేంద్రాలుగా తీర్చిదిద్దటం.

(30 వ పేజీ తరువాయి)

చీకటిలో ముంచేయా
చెత్త చదువులిక వద్దూ ॥ఎం॥
సత్తువ గల చదువులకై
మత్తు వీడి సాగుదాం
ఉపాధినగు విద్యలకై
ఉద్యమించి సాగుదాం ॥ఎం॥
మౌఢ్యాలను పాతిపెట్టి
మేధస్సుకు పదును పెట్టు

సశాస్త్రీయ విద్య కొరకు
సమిష్టిగా సాగుదాం
కూడు, గూడు, గుడ్డనిచ్చు
వ్యవస్థకై పోరుదాం
ఆశయాల వెలుగులోన
విప్లవాల బాటలోన
వీరులమై సాగుదాం
విప్లవించి తీరుదాం.

# పాష్ కవిత

— సూర్యతేజ




ప్రారంభ దశలో ప్రతివాడూ వేలు పెట్టానికి అవకాశమిచ్చే సాహిత్య ప్రక్రియ కవిత. భావోద్రేకాలను ప్రకటించుకోవడానికి సహజంగా కవితా రంగాన్నే ఎన్నుకొంటాడు మనిషి. కవిత ప్రయోజనం, దాని నిర్మాణం, దాని ద్వారా సమాజాని కివ్వవలసి వున్న బలమైన సాంస్కృతిక సంపదలను గురించి పట్టించుకొనే బాధ్యత గల కవులు కవితను అధ్యయనం చేయాల్సిందే. ఈ అధ్యయనం ఎలా సాధ్యమవుతుంది? ఇతర భాషా సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించి అందించాల్సి వుంటుంది. ఈ కర్తవ్యాన్ని వ్యక్తుల కన్నా సంస్థలే సక్రమంగా నిర్వర్తించగలవని జనసాహితి రుజావు చేస్తూ వస్తోంది. గతంలో ప్రజాసాహితి పత్రిక ద్వారా లూషన్ సాహిత్యాన్ని, ఆఫ్రికన్ కవితను అందించింది. తర్వాత పాలస్తీనా సాహిత్యాన్ని "నేను నేల కొరిగితే" పుస్తక రూపంలోనూ, ఇప్పుడు పంజాబు సాహిత్య రంగంలో ప్రభంజన మైన పాషను "పాష కవిత" సంకలన రూపంలోనూ అందజేసి తన సాహితీ సాంస్కృతిక కర్తవ్యాన్ని నిర్వహించింది జనసాహితి.

ఎవరీ పాష్?
అవతార్ సింగ్ పాష్! ఎవరివి నువ్వు?
"వంద సార్లు జన్మించడం ఎలాగో తెలిసి
ఒకసారి మరణించిన వాడివి"

త్యాగాన్ని కని పెంచుతున్న పంజాబ్ భూఖండం మీద నిలబడి మహానుభూతితో పాష్‌ను నిర్వచించాడు జనసాహితి సభ్యుడు రామానాయుడు. ఈ నిర్వచనానికి విస్తృతార్థం "పాష్ కవిత" చదవడం వల్ల తెలుస్తుంది.

పంజాబ్ విప్లవ ప్రజా సాహిత్యంలో పాష్ ఒక తుపాన్. 1988 మార్చి 23న, బ్రిటీషు వలస ప్రభువులు భగత్సింగ్‌ను ఉరి తీసిన రోజున, ఖలిస్తానీ టెర్రరిస్టులు తుపాన్ (పాష్) మీద తుపాకీలు పేల్చారు.

"ఇక వీడ్కోలు
వెళ్ళిపోతున్నాను మిత్రమా

నా వంతు జీవితం కూడా నువ్వే జీవించు....”

అంటూ ప్రజా కవులకు కర్తవ్యాన్ని తెలియజేసి పంజాబ్ వాతావరణంలో జన ప్రాణ వాయువులను విడిచాడు పాష్.

పాలక వర్గాలు తమ పబ్బం కోసం పంజాబ్‌లో మారణ హోమాగ్నిని రగిలించారు. త్యాగధనులూ, గొప్ప దేశ భక్తులూ అయిన సిక్కులను ఉగ్రవాదులని భ్రమ కలిగించారు. ఖలిస్తానీ వేర్పాటు వాదులను సృష్టించి, పంజాబ్ ప్రశాంత వాతావరణాన్ని కల్లోల పరిచారు. ఈ పరిణామ క్రమాల అనుభవాల లోంచి, ఇందిరాగాంధీ హత్యానంతరం ఢిల్లీలో జరిగిన పంజాబీల ఊచకోత వల్ల పుట్టిన వేదన లోంచి ఈ గూండా రాజ్యం, దాని వారసత్వంపై ఆగ్రహించి ఉమ్మేస్తూ,

“ఈ దేశం లోంచి నా పేరు కొట్టేయండి”

అంటూ మన ముందు కొచ్చాడు పాష్.

“నేను జన్మించక ముందే
నన్ను హతమార్చేందుకు....” కుట్ర జరిగించంటాడు. పోరాట

పంథాకి తిలోదకాలిచ్చిన వామ పక్ష పార్టీల నుద్దేశించి—

“మార్క్స్ సింహం తల
ఢిల్లీ పుర వీధుల్లో
అరుస్తూ తిరగడం
మన కళ్ళతోనే చూడాలా”

అని గుండెలను గగుర్పొడిచే విధంగా ప్రశ్నిస్తాడు. భారత రాజ్యాంగం మీద, పాలక వర్గాల కుట్ర మీద, యుద్ధం మీద, నిబద్ధత మీద, ఒకటేమిటి వెయ్యి కోణాల లోంచి కల వారి కపటాలను పరిశీలించి కవితలు రాసాడు పాష్.

సంక్షుభిత సామాజిక పరిస్థితులను పట్టించుకోకుండా పండుకోలేదు పాష్. లోహ సంకల్పంతో తన నేలమీద నిలబడి నిర్భయంగా తన ఆవేశాలను కవితా ప్రక్రియ ద్వారా ప్రకటించాడు కవి.

కవిత్వంతో ప్రజల కష్టాలను తీర్చలేమని తెలుసు పాష్‌కి.

“కష్టం గట్టెక్కే మార్గం
పదునైన ఆయుధాల అన్వేషణ” అంటాడు.

పరిస్థితులను ఏమీ పట్టించుకోకుండా వున్న మేధావి వర్గాన్ని, ప్రజలలో ఒక బలమైన వర్గంగా వున్న మధ్య తరగతి ప్రజానీకాన్ని ఉద్దేశిస్తూ రాసిన “అన్నిటి కన్నా ప్రమాదకరం” అనే అసంపూర్తి కవిత పాష్‌ను ప్రజల కవిగా నిలబెట్టే గొప్ప కవిత—

“ఇంటి నుంచి పని లోనికి వెళ్ళటం
పని పూర్తి కాగానే తిన్నగా ఇంటికి చేరుకోవడం

........అన్నిటికన్నా ప్రమాదకరం

మన కలలు చచ్చిపోవడం" ప్రజల ఆందోళనలపట్ల మమనం వహించాలనే మనుషులెవరైనా ఈ కవిత చదివినట్లయితే వాళ్ళు కోటిసార్లయినా చావక తప్పదు.

కొన్నేళ్ళుగా పంజాబ్ కవిత్వం, ప్రకృతి ప్రేమ వర్ణలతోనూ, విషాద కావ్య వస్తువులతోనూ, నాసిరకం కవితలతోనూ నిండిపోయింది. ఈ సమయంలో- తాను ప్రజా జీవితాన్ని పట్టించుకొని, నిర్బంధమూ జైలు జీవితమూ అనుభవించి, తన కవిత్వాన్ని పదునెక్కించుకొన్నాడు పాష్. మనదైన శైలితో, హృదయపు లోతులను తట్టివేసే సంవేదనతో పదాలను అయుధాలుగా మార్చుకొని పాష్ తన కవితల్లో అగ్నిని కురిపించాడు.

ఈనాడు తెలుగులో కవిత్వానికి కొదవలేదు. కవిత్వంలో వైరితలలకూ లెక్కలేదు. అస్పష్టత, సంక్లిష్టతలతో ప్రజలకు అక్కరకురాని కవిత్వం కుప్ప తెప్పలుగా వచ్చిపడుతోంది. ఒక ప్రక్క మోనాటనీ, మరొక ప్రక్క రొమాంటిసిజమ్‌తో కొట్టు మిట్టాడుతోంది తెలుగు కవిత. సరిగ్గా ఇలాంటి పరిస్థితులలో, నిర్మలానందగారి సంపాదకత్వంలో "పాష్ కవిత"ను తెలుగులో మనకందించిన జనసాహితి వారు అభినందనీయులు. పాష్ రచించిన 125 కవితలలోంచి 21 కవితలను ఎంపిక చేయడం ఎంతో కష్టమైనపని - మరోకష్టమైన పనేమిటంటే - మూల రచనను తెలుగులోనికి తీసుకురావడం. జనసాహితి కవులతోబాటు తమ చక్కని అనువాదాలను అందించిన అఫ్సర్, ఖాదర్ మొహియుద్దీన్‌లు అభినందనీయులు. శ్యామ్ మోహన్ ముఖపత్ర రచనకు ప్రత్యేకాభినందనలు చెప్పక తప్పదు.

కవిత్వ ప్రయోజనానికి స్పష్టత-
కవి నిబద్ధతకు అర్థం -
తెలియాలంటే పాష్ కవిత చదవాల్సిందే.

శిల్పాన్ని వస్తువుతో సంధానించే నేర్పరితనం కావాలంటే-
వ్యక్తీకరణలో ప్రతిభ కనబరచాలంటే -
భాషలో నేటివిటీని ప్రదర్శించాలంటే-
పాష్‌ను చదివి తీరాల్సిందే. నేర్చుకోవడానికి సంకోచించని కవి చేతిలోనూ కవితా ప్రియుల చేతిలోనూ ఉండాల్సిన పుస్తకం "పాష్ కవిత".

[పాష్‌కవిత. సంపాదకుడు : నిర్మలానంద. ప్రచురణ: జనసాహితి, దొరకు చోటు : మైత్రీ బుక్ హౌస్, మసీదు వీధి, కారల్‌మార్క్స్‌రోడ్, విజయవాడ, వెల : రు. 6-00]

# బాల్యాన్ని నిర్వచిస్తే...

ఇనుప చేతుల
హెవీ వెయిట్ ముష్టి ఘాతాలను భరించడ మంటే
నైట్ డ్యూటీలను మొయ్యడం మాత్రమే కాదు-
ప్రసవం తర్వాత
నేరుగా బానిసత్వంలోకి నెట్టేయబడడమే.
మా మోకాటి నెత్తుటికి బాక్టీరియానే వుంటొచ్చు
కానీ, మీ మెదళ్ళకు విబ్రియో కలరా వుందిగా!
మీ పాలిడ్ తత్వ హృదయాలేగా
మా వీపుల మీంచి సోడా బుడ్లను రవాణా చేశాయి.
ఏ, ఈ దేశానికి పట్టుగొమ్మలం కాదా మేం?
బీడీ ఆకులను మలచడం మాత్రమే నేర్చుకుంటున్నామేం ?
అట్లాస్ బొమ్మలైనా ఇవ్వండి.
మీ గోపురాలు వెలిసిన, మా సమాధులను చూయిస్తాం.
మీకూ-
చిత్తడి, చిత్తడిగా వున్న / మా జీవితాలు మహా సముద్రాల ఘోషలైనా
పిల్ల కాలువ రోదన లానే కన్పిస్తాయి.
ఒంటి తప్పెడల వాయిద్యాల్లానే విన్పిస్తాయి.
మా ముక్కులను పొగచూర్లకు వేలాడ గట్టి
మా వసంతాలపై ఫ్యాక్టరీలు / ప్రాఫిట్ మార్కులను చూయించుకుంటాయి.
మా చేతి వగుళ్ళ చాళ్ళ మధ్య / రైల్వే ట్రాక్ కంకర గుర్తులే
మా బాల్యానికి నిర్వచనం కాదు-ఫుట్‌పాత్ స్తన్యం పైకి విసిరేయ బడ్డ
ఎంగిలి, ఎండిన బతుకుల బాల్యం మాది.
అడుగడుగునా వేటాడ బడ్డ / చిట్టి చేతుల చెమట స్రవించిన బాల్యం మాది
బాల్యాన్ని మారకం చేసుకునేందుకై
శిలా ప్రతిమల్ని చేసి, / ఆకలి మేనాపై ఊరేగిస్తున్న మమ్మల్ని
గొడ్ల చావిళ్ళకూ, కార్ఖానా యంత్రాలకూ
సరఫరా చేస్తున్న పెత్తందారీల మూడి సరుకు
"మా బాల్యాన్ని బాల్యం కానంతా చెయ్యడం మాత్రమే!"

— మధూ దేశ్‌పాం

## సంస్కృతి : ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమం

# భూస్వామ్య సంస్కృతి రూపాలు

### మతం : అవతార పురుషులు : కర్మ సిద్ధాంతం

మతభావన, దైవభావన భూస్వామ్య సంస్కృతిలో ప్రధానమైన అంశమే అయినా వీటి పుట్టుక భూస్వామ్య సమాజానికి చాలా ముందే జరిగింది. వీటిని భూస్వామ్య సమాజం సృష్టించలేదు. అప్పటికే సమాజంలో వున్న మతభావన, దైవభావన, అతీతశక్తి భావన మొదలగువాటికి మరింత రక్తమాంసాలు చేర్చి విస్తరించి-ఆ భావనలన్నిటినీ తన ప్రయోజనాల కనుగుణంగా భూస్వామ్య సమాజం ప్రతిభావంతంగా వాడుకుంటోంది.

ఆదిమ మానవుడి భయంలోనుంచీ, అజ్ఞానంలోంచీ పుట్టింది దైవభావన లేక సృష్టికర్త భావన. తన మనుగడకోసం ప్రకృతితో సంఘర్షిస్తూ, ప్రకృతి పై పరీత్యాలను అర్థంచేసుకోలేని పరిస్థితిలో ప్రకృతిలోని వివిధ అంశాలు తమకంటే అతీతశక్తి కలవని నమ్మి వాటిని ఆరాధించడం ప్రారంభించారు ఆదిమ మానవులు. వారికిగల సాధారణ తార్కిక జ్ఞానాన్నుపయోగించి, ప్రతిదానికీసృష్టి చేసేవాడొకడుండాలి కదా-కనుక ఈ ప్రకృతికి, ఒక సృష్టికర్తను తమ రూపంలోనే వుండేవాడిని సృష్టించుకున్నారు. వారి దేవుళ్ళు నేటి నాగరిక దేవుళ్ళలా వుండరు. వారిలాగానే మొరటుగా వుంటారు ఇప్పటికీ ఆటవికులు, గిరిజనులు ఆరాధించే కొందరు దేవుళ్ళనూ, దేవతలనూ చూస్తే ఈ విషయం అర్థమౌతుంది. మొత్తం మీద మానవుడు ఈ శక్తులకంటే తక్కువస్థాయి కలవాడనని, నమ్మకమూ, మానవశక్తిని తక్కువచేసి చూడటమూ ప్రారంభమయ్యాయి. ఈ భావన ఈనాటికీ కొనసాగుతోంది.

మతంలోని అవతార పురుషుల భావన దీనికొనసాగింపే సమాజమంతా కుళ్ళిపోయి, దుష్టశక్తులతో నిండివుంటే దేవుడే ఒక అవతారపురుషునిగా జన్మించి దుష్టశిక్షణా, శిష్టరక్షణా చేస్తాడు అని మతం బోధిస్తోంది. అంతేగాని సమాజంలోని ప్రజలు చైతన్యవంతులై పాత సమాజాన్ని కూలదోసి నరికొత్త సమాజాన్ని నిర్మించుకోగల్గుతారన్న భావన పై భావనకు పూర్తిగా వ్యతిరేకం. 'ఎవరో వచ్చి, ఏదో చేసిపెట్టా'లనే భావన మన రక్తంలో తరతరాలుగా జీర్ణింప చేసింది ఈ మత భావన. 'ప్రజలే నిజవీరులు, ప్రజలే చరిత్ర నిర్మాతలు' అన్న భావన ప్రజా సంస్కృతికి సంబంధించినది. ఈ అవతారపురుషుడి భావన వల్లనే కొందరు రాజకీయ నాయకులను ఇటీవల ప్రజలు అమితంగా అభిమానించి అవతార పురుషులుగా కొలిచారు.

ఈ భావనే ప్రజలను ప్రేక్షకులుగా మార్చివేస్తోంది. కొందరు 'వీరులు' లేక 'నాయకులు' తమ సమస్యలను పరిష్కరిస్తారని ప్రజలు భావిస్తున్నారు. వారు నిష్క్రియాపరులుగా తయారవటానికి గల అనేక కారణాలలో ఇదొక కారణం.

మతం ప్రచారం చేసే కర్మ సిద్ధాంతం కూడా మానవుడిని నిష్క్రియాపరత్వంవైపు నెడ్తుంది. అంతా దేవుడే ముందు నిర్ణయించాడనీ, విధి లిఖితమనీ, బ్రహ్మరాతఅనీ, మనం నిమిత్త మాత్రులమనీ, రకరకాలుగా మానవుడి పాత్రను తక్కువ చేయడం ఈ సిద్ధాంత స్వభావం. తాము బతుకుతున్న బతుకుతో సర్దుకుపోయేట్లు చేస్తుంది ఈ కర్మ భావన. తమ బతుకుల్లో జరుగుతున్న దోపిడీని అర్థం చేసుకుని తిరగబడే చైతన్యం ప్రజల్లో రానీయకుండా చేస్తుంది ఈ భావన. దీనికి తోడు పూర్వజన్మ, పునర్జన్మ పాపం, పుణ్యం అనే భావనలు ఈ సిద్ధాంతాన్ని కట్టుదిట్టం చేస్తుంటాయి. ఈ భావనలను నిశితంగా విమర్శిస్తూ ఇండో-ఆంగ్లికన్ కవి (భారతీయుడై ఇంగ్లీషులో కవిత్వం రాసేకవి) నిస్సిమ్ ఎజికిల్ "తేలుకుట్టినరాత్రి" (The Night of the Scorpion) అనే కవిత ఒకటి రాశారు. ఆ కవితలో ఒక గృహిణికి తేలు కుడుతుంది. తేలు బతికి వుండి అటూ ఇటూ పాకుతూ వుంటే నొప్పి ఎక్కువవుతుందనీ, కనుక దాన్ని చంపేయాలనీ మూల మూలలూ వెదుకుతారు. రకరకాల మందులు వేస్తారు. తేలు మంత్రం వేస్తారు. ఇన్ని చేసినా ఆ నొప్పి 24 గంటల తర్వాత తగ్గుతుంది. పైన చెప్పిన మూఢాచారాలపై పరోక్షంగా కవి దాడి చేశాడు. ముఖ్యమైన అంశం మరొకటివుంది. ఇరుగూ పొరుగూ వచ్చి తేలు విషంతో బాధపడుతున్న గృహిణితో "పూర్వజన్మలో ఏం పాపం చేశావో - దానిఫలితమే ఇది. బాధ భరించక తప్పదు" అని కొందరూ "అయ్యో - నీకేవచ్చిందా ఈ బాధ, భరించు మరి. వచ్చే జన్మలో సుఖపడతావులే" అని మరికొందరూ ఓదారుస్తుంటారు. అంటే ఈ పూర్వజన్మ, పునర్జన్మ భావన అనే కత్తికి రెండువైపులా పదును వుంటుంది. ఎటువంటి సందేహానికైనా సమాధానం ఇవ్వగల భావనలు ఇవి. కవి ఈ భావవలను హేళనచేస్తూ రాసిన కవిత ఇది.

ఈ సందర్భంగా 1905 డిశంబర్ 3 న లెనిన్ రాసిన ఈ క్రింది పంక్తులు ఈ విషయాన్ని మరింత సూటిగా వివరిస్తాయి. "నిరంతరం ఇతరుల కోసమే పడే శ్రమతోనూ, లేమితోనూ, ఒంటరి జీవితం కారణంగా కలిగే బెంగతోనూ, నలిగిపోయిన ప్రజారాసులను సర్వే సర్వత్రా క్రుంగదీసేస్తున్న గుదిబండగా తయారైవట్టి ఆధ్యాత్మిక హింస యొక్క ఒక రూపం మతం. ప్రకృతి శక్తులకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలో ఆటవికుని అశక్తత దేవతలూ, దయ్యాలూ, అద్భుతాలు ఇత్యాదులలో నమ్మకాన్ని అతనిలో ఎలాగైతే పుట్టిస్తోందో. అలాగే దోపిడీదార్లపై సాగించే పోరాటంలో దోపిడీకి గురైన వర్గాల అశక్తత, పరలోకంలో ఇంతకంటె మెరుగైన జీవితం వుంటుందనే నమ్మకాన్ని వాటిలో తప్పనిసరిగా పుట్టించుతుంది. ఎవరైతే

# స్వీకారం

1. నాగభైరవ కథా కావ్యాలు. డాక్టరేట్ సిద్ధాంత వ్యాసం. రచన: డా. పొలుకుల శివశంకరరావు. మాధవీ ప్రచురణలు, 226 పేజీలు, వెల : రు. 59/-, కాపీలకు : శ్రీమతి వి. పీరమాంబ, మాధవీ సదనం, నీలకంఠాపురం, జాండ్రపేట (పోస్టు), ప్రకాశం జిల్లా. 523 165.
2. తూర్పు యూరప్, సోవియట్ యూనియన్, తియనాన్‌మెన్‌లలో ఇటీవలి పరిణామాలూ - మార్క్సిస్టు ఆలోచనా విధానమూ...., ·2 పేజీలు.
   వెల : నాలుగు రూపాయలు, 'ఒలంపస్' ప్రచురణ, చిరునామా-'ఒలంపస్', 8-12-41 హబ్సి గూడా, హైదరాబాదు-500 007. ప్రతులకు : నవయుగ, నవోదయ-హైదరాబాదు. మైత్రి, ప్రగతి-విజయవాడ. నవోదయ-గుంటూరు,
3. జె. బాపిరెడ్డి రచనలు : **In Quest of Harmony**, **Price : Rs. 25/-**, **Urn of Love, Price : Rs. 25/-**, ప్రేమారామం, వెల : రు. 20/- ప్రణవ ప్రణయం, వెల : రు. 25/-, పంచ బాణసంచా-వెల: రు. 25/- రంగురంగుల చీకట్లు-వెల : రు. 25/- మనసులోని మాట, వెల: రు. 30/- ప్రతులకు : జయం పబ్లికేషన్స్, ప్లాట్ నంబరు 10, రోడ్ నంబరు 5, జూబిలీ హిల్స్, హైదరాబాదు-500034.
4. మృత్యువే మరణిస్తుంది. సముద్రుని కవిత-సముద్రుని స్మృతి. 54 పేజీలు, వెల : పది రూపాయలు. షైనింగ్ పాత్ ప్రచురణ. కాపీలకు : పీస్ బుక్ సెంటర్, 1-8-518/16/2, వెంకటేశ్వర దేవాలయం దగ్గర, చిక్కడపల్లి, హైదరాబాదు-500 020.

---

→ జీవితాంతమూ కష్టపడుతూ పేదరికంతో సతమతమౌతుంటారో అట్టివారికి మతం ఇహలోక జీవితంలో నమ్రత, సహనాలను బోధించుతుంది. వారికి స్వర్గలోక సౌఖ్యంలో ఆశ చూపించి, వారిని ఊరడించుతుంది. ఇక ఎవరైతే ఇతరుల కష్టంపై జీవించుతారో, అట్టి వారికి మతం ఇహలోక జీవితంలో సర్వమానవ ప్రేమను ప్రదర్శించమని బోధించుతుంది. అట్టివారి జీవితాన్నంతటినీ ఎంతో చౌకబారు వాదనలతో సమర్థించి, స్వర్గలోక సౌఖ్యానికి టిక్కెట్లను వారికి చౌకధరకే అమ్ముతుంది. మతం ప్రజల నల్లమందు. మతం ఒకరకమైన ఆధ్యాత్మిక కాపుసారాయివంటిది. పెట్టుబడి కింద ఊడిగంచేసే బానిసలు దానిని తప్పతాగి, ఆ మైకంలో మునిగిపోయి తమ మానవ స్వరూపాన్నే, మానవార్హమైన జీవితమని కొంచెమైనా అనిపించుకోదగిన జీవితం, తాము సాగించేందుకు తమకుగల హక్కునే వారు మరచిపోతారు."

(వచ్చేసంచికలో 'వర్ణాశ్రమధర్మాలు')

# మనం అక్షరాలు రాయాల్సి వుంది...!

మనం-ఇనుపటోపీల డేగాలకింద బతుకుతున్నాం
మనం-కటకటాల నీడల వెనుక నడుస్తున్నాం
ఇక్కడ అక్షరం-ఆలోచనై మొలకెత్తడం నేరమవుతుంది
ఇక్కడ అక్షరం - మనిషై చిగురించడం నేరమవుతుంది
ఇక్కడ అక్షరం-పుస్తకమై ప్రవహించడం నేరమవుతుంది
అక్షరం-పాటై-ప్రాణమై ప్రజల గుండెల్లో స్పందనయినపుడు
అక్షరం-ఆటై-అలలై -కాలి గజ్జెల శబ్దమై గర్జించినపుడు
నియంతృత్వం-చట్టమై సంకెళ్ళ చప్పుడై వెంట బడుతుంది
మనం-అక్షరాల్ని పీల్చుకుని బతికేవాళ్ళం
మనం-అక్షరాలకు అంకితమై పోయినవాళ్ళం
కాయితాల చుట్టూ లాఠీలు పాతినంత మాత్రాన
అక్షరం అవతరించడం మానుకుంటుందా !
ఇక్కడ వీచే గాలీ అక్షరమే! పారే నీరూ అక్షరమే!
మెరిసే మేఘమూ అక్షరమే! ఉరిమే ఆకాశమూ అక్షరమే!
మట్టిపెళ్ళ-నిప్పు కణమూ అక్షరాలే!
అడవుల్లోని ఆకుల శబ్దాలా
సముద్రాల్లోని కెరటాల సంచలనాలా
అన్నీ అసహన అక్షరాలే! అన్నీ పగులబోయే అగ్నిపర్వతాలే !
ఈ భూమ్మీది సమస్త వస్తుజాలాన్ని శాసించే మనిషిమాటా అక్షరమే!
మన చుట్టూ ఎన్ని నిఘా లుంటేనేం !
ఎన్ని పహారాలుంటేనేం !
మనం అక్షరాలు రాయాల్సి వుంది
మనం ఆయుధాలై -ఈనేలకు అర్పించుకోవాల్సి వుంది

వ్యంగ్యం :

# జనాల్ని ఆకట్టుకోవాల లేక పేదోళ్ళందర్ని కలపాల

రాంబాబుకి—

ఇదుగో రాంబాబా! నువ్వు పేదోళ్ళందరి తరఫున వకాల్తా పుచ్చుకుని పేదల రాజ్యం కోసం పని సేత్తన్నావని ఇన్నాను. ఈ మద్దె మా'బావ' కూడా నీ సంగతి సెప్పాడు. మా బావ పేదల 'సంచేమం' కోసం ఉపన్నాసాలు ఇత్తాడుగాని- పేదలకోసం నిజంగా పని సేసేటోళ్ళని బతకనీయడు. అడీ ఇసయంలో సానా జాగర్తయిన మనిసి. 'ఇంతకీ ఎవడా రాంబాబు?' అని నేనడిగితే నీ పోటో నా పేతి కిచ్చాడు. తీరా సూత్తే నువ్వే. నీ పోటో సూసి కాసేపు అవాక్కయిపోనాను.

మనిద్దరం సిన్ననాటి స్నేయితులం. నువ్వు పేదోళ్ళందరికి లీడరవయి పోనావని తెలిసి ఇరగబడి నవ్వుకున్నాను. ఆ దేవుడు మా సెడ్డోడు. ఒకే బళ్ళో సదువుకున్న నిన్ను పేదోళ్ళకి లీడర్ని సేసేడు. నన్ను సారా కాంటాకటర్ని పేసేడు. పిరికోడులా ఉండే మా 'బావ'ని 'ఓల్వరగణాకి' దొరను జేసిండు. అందరం సదువుకున్నది ఆ సదువే. సెప్పినోడు ఒకే గురువు. కాని మన రాతలు మారి పోనాయి. అంతా ఆ ఏడుకొండలోడి మాత్యం గాకపోతే ఏటికిలా జరిగినాదంటావు?

మనం సెరువు గట్లమ్మట తిరుగుతు మామిడికాయలు కొట్టుకొని ఉప్పు, కారంలో అద్దుకు తినేవోళ్ళం. నేను ఒంటేలు బెల్లుకు ముందే బయటకు పోయి బజ్జీలు రెడీ పేసి ఉంచేవోడిని. మీరు బయటి కొచ్చినాక అవదాని గారి అరుగుల మీద కూచుని తినేవోళ్ళం. నువ్వు అప్పుడు కూడా 'దేశమును పేమించుమన్నా' అంటూ పాటలు పాడేవోడివి. ఆ 'పేమ' ఏందో నాకు అప్పుడరదం కానేదు. అసలు దేశాన్ని మనం ఎందుకు పేమించాలో నాకీనాటికి అరదం కాదు. నేను నా సారాని పేమిత్తాను. అది మాలచ్చిమి తల్లి. నేను డబ్బును పేమిత్తాను. అది శ్రీమాలచ్చిమి. అంతేకాని 'దేశాన్ని', 'దిక్కుమాలోళ్ళని' పేమించను. అలా పేమిత్తే నేనూ నీలాగే అయిపోతానని నాకు సిన్నప్పటి నుంచి బయంగా ఉండేది.

అయితే ఈ మద్దె కాలంలో నాలో ఇసిత్రమయిన మారుపొచ్చింది. మా బావ ఈ పరగణాకి 'దొర' అయిపోనాక నాకు జనాన్ని పేమించాలని తెలిసింది. నా సారా అమ్ముడు బోవాలంటే తాగే జనం కావాల—అందుకు నేనాళ్ళని పేమించాల. ఇంతకీ మా'బావ' నీకు గురుతుండాడా? అదే నూకల యాపారం జేసి మనూళ్లో మేడ గట్టాడు గవరయ్య....నీకు గుర్తుండే వుంటాది....మేడ గవరయ్య అనే ఓళ్ళం— అయన కొడుకే మా బావ. పవర్లోకొచ్చినాక మా బావ మా బాగా సంపాయిచ్చాడు.

పవర్లోకి రాటానికి సానా బావలు పస్తాడు. రౌడీలని, గూండాల్ని సేరదీసాడు. మతాల గొడవ లేపాడు. కులాల కుళ్ళు నింపాడు. సిన్న పిల్లలు, ముసలోళ్ళు అని కూడా సూడకుండా జనాల్ని సావదన్నించాడు. మొత్తానికి పవర్లో కొచ్చేసాడు. ఇప్పుడు మాత్రం సిరునవ్వులు సిందిత్తాడు. జనాలంటే ఒల్లమాలిన పేమని ఉపన్నాసాలు దంచుతాడు. ఈ మద్దె 'పేదల సంచేమం' కోసం 1149 కోట్లు అప్పు దెచ్చే రూపాయలతో 'పేదల సంచేమ పదకం' ఒకటి పెద్ద ఎత్తున మొదలెట్టాడు. నోరు ఇప్పితే కోట్లే కోట్లు....అయన్నీ పేదోళ్ళ కోసమే! ఎన్ని అబద్దాలయినా ఆడి జనాన్ని ఆకట్టుకోవాల. అదే 'రాచకీయం' అంటాడు.

నాణానికి 'బొమ్మ బొరుసు' ఉండట్టు మా బావకి ముందు 'నవ్వు' ఎనక 'దగా' ఉంటాయి. అలా ఉండోడే 'నాయకుడు' కాగలడని గదా మా బావ సిద్ధాంతం. పైకి పెజల కోసం 'రకతం' సిందిత్తున్నట్టు మాటాడాలంటాడు. ఎనక 'సంపాదన కోసం' దగా నేర్సుకోవాలంటాడు. నాతో సారా యాపారం అందుకే పెట్టిచ్చిండు. ఇప్పుడు నా సారా యాపారం 'మూడు జీపులు-ఆరు సిన్నకార్లు'గా సాగిపోతంది. 'గ్రానైటు' గనులు 'అసమదాములకు' తక్కువ లీజుకిచ్చి లారీలు లారీలు మాయం జేసిండు. అడవుల నుంచి కలప మాయం జెయ్యటంలో సాయపడ్డ ఆపీసర్లకి, ఉద్దోగస్తులకి పెమోసన్లిచ్చిండు. ఈ మద్దె బెరైటీసు గనుల నుంచి ముగ్గురాయి ఎలా మాయం జెయ్యాలా అని సక్కని ప్లాను ఏత్తన్నాడు. నీకు తెలుసో తెలీదో మా పరగణాలో ఓ మూల ఎక్కడో 'వజ్రాలు' దొరుకుతున్నాయంటే అక్కడికి మా 'గూండాల్ని' 'సివిల్ డ్రెస్సు'లో పంపి ఏరుకు రమ్మన్నాడు. ఒకటి కాదు....రెండు కాదు...అన్నిటిల్లోనూ సంపాదనే—పెద్ద పెద్ద యాపారాలు జేసేవోళ్ళకి నిమిసాల పెకారం లైసెన్సులు, కోటాలు, పరిమిట్లు రెడీ సేత్తాడు. అంతకు ముందే ఆళ్ళిచ్చే డబ్బు సంచులు లోనకి దోసేత్తాడు. ఈ 'మంచి' పనులన్నిటిలోనూ మా సాయం మా బావ కెప్పుడూ ఉంటాది. ఈ రకంగా మా బావ 'పెజా రాజ్యం' నడుపుతున్నాడు. పెజలు మమ్మల్ని సూసి తోడు దొంగలు అనుకోకుండా ఉంటం కోసం- 'పేదోళ్ళు, పేదోళ్ళు' అని గొంతు అర్సుకుపోయేటట్టు అరుత్తాడు. కోట్లు కోట్లు పంచేత్తున్నట్లు పేపర్లనిండా స్టేటుమెంట్లు ఇచ్చేత్తుంటాడు. ఇదంతా జనాన్ని ఆకట్టుకోటానికి మా ఎత్తులు, జిత్తులు.

ఇంతవరకు మా సంగతి జెప్పాను. ఎందుకంటె నువ్వు నా సిన్ననాటి స్నేయితుడువని. ఇక మీ ఇసయాని కొత్తాను. మీరీ 'దిక్కుమాలిన జనాన్ని' ఎందుకు పేమిత్తారో నాకిన్నటికి తెలవదు. మేము పేమిత్తున్నామంటే దానికో లెవలుంది. అద్దుంది. అరదముంది. మనది పెజాస్వామ్యం గందా—జనానికి ఓటు అక్కుంది. ఆళ్ళతో మేపు ఓట్లేయించుకోవాల. ఆ తరవాత గందా మా యాపారాలన్నీను. అందుసేత మేము జనాన్ని పేమిత్తాం. ఆళ్ళని ఆకట్టుకోటానికి ఎయ్యి

రాని ఏసాలన్నీ ఏస్తాం. సెయ్యకూడని మాయలన్నీ జేస్తాం. మరి మీ 'పేమతో' అరదం ఏంటి? అద్దేంటి? ఈళ్ళందర్నీ సేరదీయటం వల్ల 'నాభం' ఏంటి?

మేపు జనాల్ని ఆకట్టుకునే పనులన్నిటిలోను మీరు అడ్డు తగల్తన్నారు గందా! అందుకే మా బావకి మీరంటే వల్లమాలిన బయం. ఆ బయంతో ఒకో మారు పూనకం ఒచ్చినోడు నాగ ఊగిపోతాడు. మిమ్మల్నందర్నీ బొక్కలోకి తోయించేయాలంటాడు. పీకలు తీయించేయాలంటాడు. మీలాంటోళ్ళెవరు మీటింగు పెట్టకుండా, సభలు, సమ్మెలు సేయకుండా....అలాంటి అక్కలేవన్నా గతంలో ఉంటే ఆటినన్నిటిని కాలరాసేయాలంటాడు. మేమంతా ఉండగా ఆడి కెందుకింత బయమో నా కరదం కాదు. నువ్వు సెప్పిన 'పేమ సిద్దాంతం' నా కరదం కాక పోయినా ఆడి కరదమయ్యింటాది. అందుకే అంత బయం కాబోలు. నీ పోటో నాకాడ పడేసి యీడి సంగతి జూడమన్నాడు. నిన్ను అరెస్టు జేయమని పోలీసోళ్ళకి ఆర్డరిచ్చాడు. కాల్సి సంపినా పర్లేదని 'హుకుం' జారీ పేసిండు. ఈ 'దిక్కుమాలి నోళ్ళందరు' కలిత్తే తనకు దిక్కునేకుండా పోద్దని లబో దిబోమంటుండు. 'ఇంత మందిమి మేవుండగా నీకేటి బయం?' అన్నా ఇనుకోటం నేదు.

ఇదుగో రాంబాబూ! నువ్వేదన్నా సేసుకో గాని పేదోళ్ళందర్ని కలపాలని సూడకు. అనొక్కటే నేను నిన్ను కోరేది. నేకపోతే నా మాట ఇనుకుని నువ్వు సక్కగ మా బావ సూపిచ్చిన 'యాపారం' ఏదో ఒకటి పేసుకో. ఎనకాల నేనుం టాను; నిన్ను పెద్దోడిని పేత్తాను. జనాన్ని ఆకట్టుకోటానికి నువ్వు ఏ రకం 'పెబ్లిసిటీ' ఇమ్మంటే ఆ రకం 'పెబ్లిసిటీ' ఇత్తాను. ఏదన్నా ప్యాక్టరీ జూసుకో. మా పార్టీ తరుపున నిన్ను 'కార్మిక నాయకుణ్ణి' జేసేత్తాను. కార్మికులకు సేవ జేత్తా నువ్వు పైకి రావచ్చు. పని ఎగెయ్యొచ్చు. ఎవడన్నా ఏమన్నా అంటే నాతో జెప్పు- వాళ్ళ డొక్క సించి డోలు కట్టేత్తాను. మాయలు జేసి జనాన్ని ఆకట్టుకోవాల గాని రాగాలు పేసి జనాన్ని పైకి తేకూడదు. సదువుకున్నోడివి నీకీపాటి తెలవకపోతే- సారావోడిని నాకేటి తెలుత్తది సెప్పు. మరి గందుసేత నేను సెప్పినట్టు నువ్వు సేత్తే నీ జోలికి నేను రానని ఇందు మూలంగా నీకు తెలియజేసుకుంటన్నాను. ఇప్పటికు. ఎంతయినా మా 'బావ' నా ఎనకాల ఉన్నాడు గందా! అదీ నా 'దమ్ము'.

ఇట్లు
నీ సిన్ననాటి స్నేయితుడు
కత్తుల కాంతయ్య.

---

వెలువడింది! జనసాహితి ప్రచురణ రెండవ ముద్రణ

'నా నెత్తురు వృధా కాదు' భగత్‌సింగ్ రచనలు

ప్రతులకు : మైత్రీబుక్‌హౌస్, విజయవాడ - 2.

**కవిత:**

## అక్షరాల్ని రగిలించక తప్పదు

శ్వాసే అక్షరాలతో మొదలు పెట్టిన వాళ్ళం
అక్షరాలమీన ఆంక్షలంటే అదిరిపోతామా?
అక్షరాల్ని విస్మరించి
బతుకును వెళ్ళబుచ్చగలమా?
భుక్తిని మరచిపోగలమేమోగాని
అక్షరాల్ని మరచి పోగమా ?
అక్షరాల్ని నక్షత్రాలు చేసి
ఆకాశానికి అద్దినవాళ్ళం
అక్షరాల్ని విత్తనాలు చేసి
నేలనేలంతా నాటిన వాళ్ళం
ఆంక్షలకు విస్తుపోతామా?
వాడు ఆక్షరాల్ని కత్తులబోనుల్లో బంధించినప్పుడే
చురకత్తుల చేసి దూసిన వాళ్ళం
వాడు అక్షరాల్ని నెత్తుటి మడుగుల్లో ముంచినప్పుడే
నెత్తురు జండాలు చేసి ఎత్తిన వాళ్ళం
అక్షరాలు మన ఉనికైనప్పుడు
అక్షరాలు మన బతుకైనప్పుడు
అక్షరాలే అక్షరాలా మనమైనప్పుడు
ఈ రోజు కొత్తగా భయపడతామా?
ఈ రోజు కొత్తగా వెనుకడుగేస్తామా?
అక్షరాలంటే భయం వాడికి
ఉనికిని పోగొడతాయన్న వణుకువాడికి
అందుకే అక్షరాల మీద ఆంక్షలు విధిస్తున్నాడు
తప్పదన్నా! తప్పదు
జీవితాన్ని బతికించడానికి
అక్షరాల్ని బతికించక తప్పదు
ఆంక్షల్ని తగలెయ్యడానికి
అక్షరాల్ని రగిలించక తప్పదు

—అల

గల్పిక :

# మద్దతు

— జగం

దిబ్బ రాజ్యంలో రాజ్యపతి ఎన్నికలు ప్రకటించారు. ప్రధాన రాజకీయ పక్షాల శిబిరాల్లో అంతా కోలాహలంగా వుంది.

దిబ్బ రాజ్యానికి ప్రధానమంత్రి దిబ్బరాజుగారు. ఆయన గత సంవత్సరం రాజ్యాంగ బద్ధంగా, ప్రజాస్వామ్యయుతంగా జరిగిన రిగ్గింగ్‌లో భారీ మెజారిటీతో గెలుపొంది, అంతర్జాతీయ ఖ్యాతి నొందారు. గతంలోని ప్రభువులు దిబ్బ రాజ్యాన్ని కొద్ది కొద్దిగా తాకట్టు పెడితే, దిబ్బరాజుగారు మాత్రం ఏకంగా రాజ్యాన్నే తెగనమ్మే సేందుకు పూనుకున్నారు. దిబ్బరాజుగారు ఇందుకొరకై విప్లవాత్మకంగా ప్రవేశపెట్టిన ఆర్థిక సంస్కరణలు స్వదేశీ, విదేశీ బడా బాబుల ప్రశంసలు పొందాయి. ఈ తరుణంలో జరుగుతున్న రాజ్యపతి ఎన్నికలు అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకున్నవని రాజకీయ నిరుద్యోగులు విశ్లేషిస్తున్నారు.

దిబ్బరాజుగారు అన్ని రాజకీయ పక్షాలతోనూ సంప్రదించి, అందరికీ ఆమోద యోగ్యమైన వ్యక్తిని రాజ్యపతి పదవికి అభ్యర్థిగా నిర్ణయిస్తారని ప్రతిపక్షాలైన పంగనామాల పార్టీవారు, కలగూరగంప పార్టీవారు, శిఖండి పార్టీవారు ఆశించారు. వారి ఆశలు అడియాశలయినట్టుగా దిబ్బరాజుగారు విద్యావేత్త, సౌమ్యులు, అంతకు మించి రబ్బరు స్టాంపు స్వభావం కల శాస్త్రిగార్ని తమ భస్మాసుర పార్టీ తరఫున అభ్యర్థిగా ప్రకటించారు. దాంతో ప్రతిపక్షాలు అమితంగా బాధ పడి కించిత్తు కినుక వహించారు. తమ అభిమతానికి భిన్నంగా తమ వైఖరిని ప్రకటించాల్సిన పరిస్థితికి నెట్టబడ్డారు. సామాజిక న్యాయం కొరకు గాను అట్టడుగు వర్గాల్లో విద్యావేత్త అయిన పంతులుగార్ని తమ పార్టీ అభ్యర్థిగా కలగూరగంప పార్టీవారు నిర్ణయించారు. 'రామజపమ్ ముక్తి మార్గ'మని ప్రబోధిస్తూ మత విశ్వాసాల నిచ్చెనపై ఎగ ప్రాకి ప్రధాన ప్రతిపక్షాలైన పంగనామాల పార్టీ వారు అనేక కీలక సమయాల్లో దిబ్బరాజుగార్ని ఆదుకొంటూ వచ్చారు. ఉప రాజ్యపతి ఆశలు సన్నగిల్లడంతో విధి లేకనే కలగూరగంప అభ్యర్థిని బలపర్చారు. పేదల సిద్ధాంతాన్ని కాశీలో వదిలేసివచ్చి, దిబ్బరాజుగారిలో లౌకికతత్వాన్నీ, దేశభక్తియుత స్వభావాన్నీ అంచనా వేసి గ్రహించిన శిఖండి పార్టీవారూ పంగనామాల పార్టీవారూ, కలగూరగంప పార్టీవారూ తీవ్ర మనస్తాపం చెందారు. వేర్పాటువాద, మతోన్మాద, విచ్ఛిన్నకర

శక్తుల ప్రాబల్యం పెరుగుతున్న నేటి క్లిష్ట పరిస్థితుల్లో దేశ సమగ్రతకు, సమైక్యతకు ముప్పు వాటిల్లకుండా ఈ రాజ్యపతి ఎన్నికల్లో పాల్గొంటామని ఆ పార్టీ ప్రకటించింది.

రాజ్యపతి ఎన్నికల రోజు రానే వచ్చింది. ఆ రోజు దర్బారులో ప్రధానామాత్యులు దిబ్బరాజుగారు, ఆయన మంత్రివర్గ సహచరులు తమ తమ సీట్లలో సుఖాసీనులయ్యారు.

సభాపతిగారు లేచి "ఇప్పుడు రాజ్యపతి ఎన్నికలు నిర్వహించబోతున్నాం. భస్మాసుర పార్టీ అభ్యర్థి శాస్త్రిగారూ, కలగూరగంప పార్టీ తరఫున పంతులుగారూ పోటీ చేస్తున్నారు. చేతులెత్తి బహిరంగ ఓటింగు ద్వారా రాజ్యపతిని ఎన్నుకోవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నామ"ని సీటులో కూర్చున్నారు.

ఈ ఎన్నికల్లో పంగనామాల పార్టీ కలగూరగంప పార్టీ అభ్యర్థికి మద్దతు నివ్వడంతో-శిఖండి పార్టీ వారు ఇచ్చే మద్దతే గెలుపు ఓటములను నిర్ణయిస్తుందని రాజకీయ నిరుద్యోగులందరూ ఆతృతతో ఎదురు చూస్తున్నారు.

శిఖండి పార్టీ నాయకుడు శల్యుడు గారు లేచి "నేడు దేశంలో...." అంటూ తమ పార్టీ నిర్ణయం ప్రకటిస్తున్న సమయంలోనే దర్బారు బయట చాలా పెద్ద గలాటా చెలరేగింది. "దిబ్బరాజు ప్రజా వ్యతిరేక విధానాలు నశించాలి!", "దిబ్బ రాజ్యాన్ని విదేశాలకు తాకట్టు పెట్టే చర్యల్ని ఎదుర్కొనండి!", "సామ్రాజ్యవాదులకు ఊడిగం చేస్తున్న దిబ్బరాజు వెంటనే గద్దె దిగాలి!" అంటూ నినాదాల హోరు వినిపించింది. సైనికుల కరకు బూట్ల చప్పుడూ, "ఢాం" "ఢాం" కాల్పుల శబ్దాలూ ప్రజల హాహాకారాలూ మిన్నుముట్టినాయి.

వెంటనే ప్రధాని దిబ్బరాజుగారు లేచి, "దర్బారు బయట జరుగుతున్న దాని పట్ల గౌరవనీయులైన దర్బారు సభ్యులు ఆందోళన చెందాల్సిన పనిలేదు. రాజ్య సమగ్రతకు, సమైక్యతకు భంగం కల్గించేందుకు, రాజ్యాన్ని అస్థిర పర్చేందుకు తీవ్రవాదులూ, అరాచక శక్తులూ కుట్ర చేస్తున్నాయి. వారి నాయకత్వాన ఊరేగింపు జరిపారనీ, అరాచకానికి దిగినందుకు గాను, తీవ్రవాదులపై కాల్పులు సాగించారు. అందులో అనేకమంది చనిపోయారు. పరిస్థితిని అదుపులోకి తెచ్చేందుకు, హోం శాఖామాత్యులు కట్టుదిట్టమైన చర్యలు తీసుకుంటున్నారు. కనుక గౌరవనీయులయిన దర్బారు సభ్యులు ప్రజాస్వామ్య యుతంగా, ప్రశాంతంగా రాజ్యపతిని ఎన్నుకుంటే బాగుంటుం"దని శలవిచ్చారు. తిరిగి శల్యుడుగారు లేచి తమ వైఖరిని ఈ క్రింది విధంగా ప్రకటించారు: "విచ్ఛిన్నకర, అరాచక శక్తులు చెలరేగుతూ రాజ్య సమగ్రతకూ, సమైక్యతకూ ముప్పు తెస్తున్నాయి. ఇటువంటి క్లిష్ట పరిస్థితుల్లో భస్మాసుర

పార్టీ అభ్యర్థిని బలపర్చాలని మా పార్టీ నిర్ణయించింది. అందరికీ ఆమోదయోగ్య మైన అభ్యర్థిని ఎన్నుకునే అవకాశాన్ని జారవిడిచిన భస్మాసుర పార్టీకి మా తీవ్ర నిరసనను తెలియజేస్తున్నాం. కనీసం ఉప రాజ్యపతి పదవికి బలహీన వర్గాల ప్రతినిధిని ఎన్నుకునే అవకాశాన్ని ఆ పార్టీ కల్గిస్తుందని ఆశిస్తున్నాం. అదే సమయంలో భస్మాసుర పార్టీ ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక విధానానికి వ్యతిరేకంగా, మతోన్మాదానికి వ్యతిరేకంగా సాగించే పోరాటానికి ఈ ఎన్నికల్లో మేం తీసుకున్న పై ఖరి అడ్డంకి కా"దని ఒక ప్రశ్నకు సమాధానంగా హామీ ఇచ్చారు శల్యుడుగారు.

ఆ పార్టీల అభ్యర్థుల కొచ్చిన ఎత్తిన చేతుల ఓట్లు లెక్కించగా భస్మాసుర పార్టీ అభ్యర్థి శ్రీ తిరపతిగుండు శాస్త్రీగారు ఘన విజయం సాధించారని ప్రకటించారు. శాస్త్రిగారి గెలుపుకు దోహదపడిన శిఖండి పార్టీవారికి భస్మాసుర పార్టీ మనఃపూర్వక అభినందనలు తెల్పారు.

---

(8 వ పేజీ తరువాయి)

జోడించి విప్లవ సాహిత్యోద్యమ పెంపుకు కృషి సల్పాడు. సాహిత్యోద్యమ పరిధిని విస్తరించి ప్రజా కార్యకర్తగా ఎదిగి నూతన ప్రజాస్వామిక విప్లవోద్యమంలో తన వంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తూ కా॥ సుబ్బారావు పాణిగ్రాహి వారసత్వాన్ని కొనసాగించాడు.

విప్లవ కార్యక్రమాల్లో నిమగ్నమై విప్లవోద్యమ ఐక్యతకు కృషి జరుగుతున్న సమయంలో 26-6-'92న రాత్రి కామ్రేడ్ నూతన్, కామ్రేడ్ మల్లేషలను పోలీసులు అరెస్టు చేసి, చిత్రహింసలు పెట్టి బూటకపు ఎన్‌కౌంటర్ పేరున కాల్చి చంపారు. తన నెత్తురు బొట్లు బొట్లుగా పాటలయి ప్రజల గొంతులలో అనునిత్యం పారుతూనే వుంటాయి. కామ్రేడ్ నూతన్ ఈ రోజు మనకు భౌతికంగా లేకపోయినా, విప్లవోద్యమంలో సజీవంగా కర్తవ్యాన్ని బోధిస్తూ, చిరునవ్వుతో మనకు మెరుస్తూనే వుంటాడు. అమర వీరులు వదిలిన ఆశయాలను, విప్లవ కర్తవ్యాన్ని కొనసాగిస్తామని ప్రతిన బూనుతూ కామ్రేడ్ నూతన్‌కు, కా॥ మల్లేషలకు విప్లవ జోహార్లర్పిస్తూ ఈ ఐక్యతా సదస్సు తీర్మానిస్తోంది.

కా॥ నూతన్ అమర్ హై.

ప్రజా కళాకారులు, ప్రజా ఉద్యమాలపై ప్రభుత్వ దమన కాండ నశించాలి.

కొన్ని అనివార్య కారణాల వల్ల జూన్ 92 సంచికను
ప్రచురించలేక పోయినందుకు చింతిస్తున్నాము. —సం॥

(7 వ పేజీ తరువాయి)

నిర్మించాలనే లక్ష్యంతో మా సంస్థలను పునర్నిర్మాణం చేసుకుంటున్నాం.

జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య, అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, అరుణోదయ (ఆర్గనైజింగ్ కమిటి)లో వున్న రచయితలందరూ ఇక నుండి జన సాహితిలోనూ, కళాకారులందరూ అరుణోదయలోనూ కొత్తగా రూపొందించుకున్న ప్రకాశికల వెలుగులో ప్రజాసాహితీ సాంస్కృతిక ఉద్యమాన్ని ముమ్మందుకు నడి పించే కృషి చేయడానికి నిర్ణయించుకున్నాం.

సామాజిక మార్పుకోసం భూస్వామ్య, సామ్రాజ్యవాద సంస్కృతికి వ్యతి రేకంగా ఇంకా కొన్ని స్థానిక, రాష్ట్రస్థాయి రచయితల, సాంస్కృతిక సంస్థలు రాష్ట్రంలో పనిచేస్తున్నాయి. ఈ సంస్థలతో సమైక్యం కావడానికి జనసాహితి, అరు ణోదయలు చిత్తశుద్ధితో, కృషి చేస్తాయి. అంతేగాక, ఇదే లక్ష్యంతో వ్యక్తులుగా కృషిచేస్తున్నవారూ, ప్రజాస్వామికవాదులూ మా కృషికి సహకరిస్తూ, సమైక్యం కావలసిందిగా పిలుపునిస్తున్నాం.

ప్రజాసాహిత్యం వర్ధిల్లాలి ! జనసాహితి వర్ధిల్లాలి !!
ప్రజా సంస్కృతి వర్ధిల్లాలి ! అరుణోదయ వర్ధిల్లాలి!!
ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమం వర్ధిల్లాలి !
విప్లవ రచయితల, కళాకారుల ఐక్యత వర్ధిల్లాలి !!

| **అరుణోదయ** | **అరుణోదయ** | **జనసాహితి** |
|---|---|---|
| (సాంస్కృతిక సంస్థ) | (ఆర్గనైజింగ్ కమిటీ) | (సాహిత్య సంస్థ) |

30-6-92, విజయవాడ.

## ఐక్యతా సదస్సు తీర్మానాలు

**ఐక్యతకి సంబంధించి మూడు సాహితీ సాంస్కృతిక సంస్థల సర్వసభ్య సమావేశాల తీర్మానాలు :**

### జనసాహితి సర్వసభ్య సమావేశం తీర్మానం

విప్లవ దృక్పథం కలిగిన ప్రజా సాహితీ సాంస్కృతిక సంస్థలు ఐక్యం కావాలనే ప్రజల వాంఛ వాస్తవం కాబోవటాన్ని జనసాహితి హర్షిస్తోంది.

1974లో ఏర్పడి, సాంస్కృతికోద్యమ కృషి సాగిస్తూ వస్తున్న అరుణోదయ సాంస్కృతిక సమాఖ్యతో ఐక్యమవడానికి జనసాహితి సర్వసభ్య సమావేశం

ర్ణయించింది. భవిష్యత్తులో రచయితలందరూ జనసాహితి సంస్థగానూ, కళాకారు లందరూ అరుణోదయ సంస్థగానూ ఏర్పడటానికి సర్వసభ్య సమావేశం ఆమో దించింది.

ప్రస్తుత చారిత్రక పరిస్థితులలో ఐక్యత, పునర్నిర్మాణం అవశ్యంగా గుర్తిస్తూ, అందుకు తగిన చర్యలు చేపట్టవలసిందిగా కార్యవర్గానికి అధికారాన్ని ఇస్తోంది.

మచిలీపట్నం, 19-6-92.

## అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య సర్వసభ్య సమావేశం తీర్మానం

విప్లవ దృక్పథం కలిగిన ప్రజా సాహితీ సాంస్కృతిక సంస్థలు ఐక్యం కావాలనే ప్రజల చిరకాల వాంఛ వాస్తవం కాబోతున్నందుకు అరుణోదయ నిండు మనసుతో హర్షిస్తోంది.

1978 లో ఏర్పడి, సాహితీ సాంస్కృతికోద్యమంలో కృషి చేస్తున్న జనసాహితీ సాంస్కృతిక సమాఖ్యతో ఐక్యం కావటానికి అరుణోదయ సర్వ సభ్య సమావేశం నిర్ణయించింది. భవిష్యత్తులో కళాకారులందరూ అరుణోదయ సంస్థ గానూ, రచయితలందరూ జనసాహితి సంస్థగానూ ఏర్పడటానికి అరుణోదయ సర్వ సభ్య సమావేశం ఆమోదించింది.

ఈనాటి చారిత్రక పరిస్థితులలో ఐక్యతా, పునర్నిర్మాణం యొక్క అవశ్య కతను గుర్తిస్తూ, అందుకు అవసరమైన చర్యలు చేపట్టవలసిందిగా కార్యవర్గానికి ఈ సర్వసభ్య సమావేశం అధికారాన్ని ఇస్తోంది.

గుంటూరు, 29-6-92.

## ఐక్యతా తీర్మానం

ఈనాడు మన విప్లవోద్యమం అనేక గ్రూపులుగా ఉన్నది. దాని ఫలితంగా సాంస్కృతిక ఉద్యమం, సాహితీ ఉద్యమాలు కూడా చీలికలకు గురి కాబడినాయి. విప్లవాభిమానులు, సాహితీ పరులు, ప్రజలు మాత్రం ఈ పరిస్థితి నుండి బయట పడమని డిమాండు చేస్తున్నారు. శ్రామిక జన సంస్కృతిని, నూతన ప్రజాస్వామిక విప్లవ లక్ష్యాన్ని చాటి చెప్పే కళాకారులు, రచయితలు ఏకమవ్వాలని పరిస్థితులు ఒత్తిడి చేస్తున్నాయి. అందుకే ఒకే లక్ష్యం కలిగిన అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, అరుణోదయ ఆర్గనైజింగ్ కమిటీ, జనసాహితి సంస్థలు గత మూడు సంవత్సరాలుగా ఐక్య కార్యాచరణ చేస్తూ ఒకరినొకరు అర్థం చేసుకున్నాం. ఏ మినహాయింపులు లేకుండా ఐక్యం కావాలని ఒక అభిప్రాయానికి వచ్చాము. ఈ నేపథ్యంలో అరుణోదయ ఆర్గనైజింగ్ జనరల్ బాడీ రచయిత లందరు

జనసాహితిగానూ, కళాకారులందరూ అరుణోదయగానూ ఏర్పడాలనే ప్రతిపాదన
ఏకగ్రీవంగా బలపరుస్తుంది. మన ముందు అమరుడు సుబ్బారావు పాణిగ్రా
మొదలుకొని కా॥ నూతన్ వరకు ఎంతో మంది కళాకారులు, రచయితలు ప్రజల
మమేకమయ్యారు. ప్రజల్లో కలసిపోయినారు. ప్రజల కోసం ప్రాణాలిచ్చినా
ఈ అమర వీరులను ఆదర్శంగా తీసుకొని నూతన ప్రజాస్వామిక విప్లవ కర్త
నిర్వహణకై సాంస్కృతిక రంగంలో మన వంతు కర్తవ్యం మనం చేద్దాం.

29-6-92

విప్లవాభినందనలతో
అరుణోదయ ఆర్గనైజింగ్ కమి

## ప్రజాపోరాటాలపై ప్రభుత్వ దమనకాండను ఖండించండి

మునుపెన్నడూ లేనివిధంగా రాజ్యం - రక్కసి తన క్రూరమైన నిర్బంధ
కోరలు చాస్తోంది. నరమాంసరుచి మరిగిన పులిలాంటి రాజ్యం తన మనుగడకోసం
పీడిత ప్రజల నణచి వేయడమే ఏకైక మార్గంగా ఎంచుకుంది. ప్రజల మౌలిక
సమస్యలేవీ పరిష్కరించలేని దోపిడీ పాలక ప్రభుత్వం శాంతిభద్రతలే అన్ని
సమస్యలకు మూలమనే భ్రమను కల్పిస్తూ రాజ్యమేలుతున్నది. ప్రజాపోరాటాల
ఉక్కుపాదంతో అణచివేస్తూన్న ప్రభుత్వం తెలంగాణా గుండెలపై బి.ఎస్.ఎఫ్.,
సి.ఆర్.పి.ఎఫ్., పారామిలటరీ, ఐ.టి.బి.ఎఫ్ లాంటి దుర్మార్గమైన సైనిక బలగాల్ని
దించి భూస్వామ్య దోపిడీ వ్యవస్థలో ప్రజలకూ పాలకులకూ మధ్యనున్న 'సరి
హద్దు'ను కాపాడేందుకు విఫలయత్నం చేస్తోంది. అనునిత్యం పదుల సంఖ్యలో
నవయువకులను పిట్టల్లా కాల్చిపారేసి ఎన్‌కౌంటర్ల కట్టు కథ వల్లిస్తున్నారు. జనా
ర్ధనరెడ్డి ప్రభుత్వం అనుసరిస్తోన్న ప్రజా వ్యతిరేక, అవినీతి, లంచగొండి చర్యలను
కప్పిపుచ్చుకోవడానికి, ప్రజల సమస్యల పరిష్కారంలో వైఫల్యాల్ని నిర్బంధకాండ
ద్వారా అధిగమించ పూనుకున్నారు. పోలీసుల ఆగడాలకు అంతులేదు. తుపాకీ రాజ్య
మేలుతున్నది. ప్రభుత్వం నేరుగా సారాకాంట్రాక్టర్ల చేతుల్లోకి, బ్రోకర్ల చేతుల్లోకి,
రాజకీయ గూండాల చేతుల్లోకీ, హంతకుల చేతుల్లోకీ వెళ్ళిపోయింది. ఇదేమిటన్న
వారిని అరెస్టులు, చిత్రహింసలు, అక్రమకేసులు, ఎన్‌కౌంటర్లు అతి సామాన్య కాను
కలైపోయాయి. ప్రజా కళాకారులపైనా, కార్యకర్తలపైనా నిర్బంధం తీవ్రస్థాయిలో
విరుచుకుపడుతోంది. ఇందులో భాగంగానే అదిలాబాద్ జిల్లా ప్రజాపోరాటాలనాయ
కుడు, కవి, కళాకారుడు ఐన కా॥ పవన్ కుమార్‌రాజు (నూతన్, అతనే వేణు)ను,
కా॥ మల్లేష్‌ను నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేసి పోలీసులు ఎప్పటిలాగే బూటకపు ఎన్
కౌంటర్ కట్టు కథలల్లి అబద్ధాల్ని కూస్తున్నారు.

"ఈ దారుణ మారణ" నిర్బంధ కాండను జనసాహితి, అరుణోదయ

ఐక్యతా సదస్సు తీవ్రంగా ఖండిస్తోంది. ప్రజల న్యాయమైన పోరాటాలపై నిర్బంధ కాండను ప్రయోగించి ప్రభుత్వం విర్రవీగవద్దని హెచ్చరిస్తోంది. ప్రజలదే అంతిమ విజయమనీ, ఈ దోపిడీ రాజ్యం కుప్పకూలి పోతుందనీ తన ప్రగాఢ విశ్వాసాన్ని ప్రకటిస్తోంది.

## ప్రజా ఉద్యమాలపై ప్రజాసంఘాలపై నిషేధాన్ని ఖండిస్తూ

దున్నేవాడికే భూమికోసం, వ్యవసాయక విప్లవం ఇరుసుగా నూతన ప్రజా స్వామిక విప్లవం కోసం పోరాడుతోన్న విప్లవ కారులపై నిర్బంధం కొత్తదికాదు. తెరెస్టుల పర్వాలు కొత్తవి కావు. ఎన్‌కౌంటర్లు అంతకన్నా కొత్తవికావు. అయితే ఇప్పుడు ప్రభుత్వం తన కోరలకంటిన నెత్తురు సరిపోదన్నట్టు కొంగ్రొత్తగా నిషే ధాన్ని ప్రకటించింది. పీపుల్స్‌వార్, దాని అనుబంధ సంస్థలపైన నిషేధాజ్ఞలు విధించి విప్లవోద్యమాన్ని అణచివేసానని విర్రవీగుతోంది. కాని ఇది సాధ్యంకాదు. పారేనీటికి, ఉప్పొంగే సముద్రానికీ, దూకే జలపాతాన్ని నిషేధం విధించి ఆపలేరు. అట్లే ప్రజల ఉద్యమాన్ని ప్రజల న్యాయమైన సమస్యలపై పోరాడుతున్న వారిపై, వ్యవస్థ మార్పుకోసం నెత్తురొడుతున్న వారిపై నిషేధం ప్రకటించి దోపిడీపాలక వర్గాలు ఏనాటికీ విజయం సాధించలేవు పీపుల్స్‌వార్ పార్టీ తప్పుడు ఎత్తు గడలు వేస్తేవేసి వుండవచ్చుగాక విప్లవ పంథాలో అతివాద దుందుడుకు విధానాన్ని ప్రదర్శించి వుండవచ్చుగాక, అయినంత మాత్రాన ప్రజలపై దారుణ నిర్బంధాన్ని ప్రయోగించడమూ, నిషేధం విధించడమూ ఎంతమాత్రమూ సరియైనవికాదు. ఈ ఐక్యతా సదస్సు ప్రభుత్వ నిషేదాజ్ఞలని, సాగిస్తున్న పై దమకాండనూ తీవ్రంగా ఖండిస్తోంది.

నీచ నికృష్ట క్రూర కర్కోటక జనార్దనరెడ్డి ప్రభుత్వం వెంటనే నిషేధాజ్ఞలు వెనక్కి తీసుకోవాలనీ, తెలంగాణ గుండెలపై నుంచి తన ఉక్కుపాదాన్ని విరమించు కోవాలని డిమాండ్ చేస్తోంది.

## పతన విలువల్ని ప్రోత్సహిస్తున్న పాలక వర్గాల విధానాల్ని ఖండిస్తూ

తుమ్మితే ఊడే ముక్కులా వున్న కేంద్ర ప్రభుత్వం అటు మతవాదులతోను, ఇటు సామ్రాజ్యవాదులతోను ఎంచక్కా మిలాఖత్ అయి, ఏడాది దుష్ట పరిపాలనను విజయవంతంగా ముగించుకొంది. ఈ ఏడాది కాలంలో ప్రజల సమస్యలు ఈషణ్మా త్రమైనా పరిష్కరించబడక పోగా రెట్టింపై సామాన్యుని జీవితం 'దిన దిన గండం నూరేళ్ళ ఆయుష్షు'గా విరాజిల్లుతోంది. గత ఏడాది కాలంలో ఆర్థిక మంత్రి తీసుకొచ్చిన అనేక దివాళాకోరు ఆర్థిక విధానాల వల్ల దేశ ఆర్థిక వ్యవస్థ అటు ప్రపంచ మార్కెట్లో పీకల్లోతు అప్పుల ఊబిలో మునిగి, ఇటు జాతీయంగా స్టాకు

మార్కెట్ కుంభకోణాల్లో చిక్కుకుపోయి శ్లేష్మంలోపడ్డ ఈగలా గిలగిలలాడుతోంది. ఈ ఆర్థిక వ్యవస్థ దళారిది. అది తీసుకువచ్చే సంస్కృతి విలువలు పతన విలువలు. మార్కెట్ కేంద్రంగా ఉత్పన్నపయ్యే ఆర్థిక ఎత్తుగడలు, తత్ఫలితంగా ఉద్భవించే 'వినియోగ సంస్కృతి' అత్యంత ప్రమాదకరమైనవి. ఈ దశలో సమస్త మానవ విలువలు మార్కెట్లో సరుకులౌతాయి. ఒక మారుతీ కారో, ఒక కలర్ టెలివిజనో మనిషి ప్రాణం కన్నా విలువయినవి అవుతాయి. దీనివల్ల ఉన్నతమైన మానవ సంబంధాలు మట్టికొట్టుకొని పోయి నీచమైన విలువలు ఉనికిలోకి వస్తాయి. గత రెండు సం॥లుగా పాలక ముష్కరులు అవలంబిస్తున్న దళారీ దోపిడీ ఆర్థిక ఎత్తుగడల వల్ల దేశం యావత్తు పతన విలువలు కట్టలు తెంచుకొన్న డ్రైనేజి కాలువలై కుళ్ళి కంపు కొడుతూ మత వాదంతో చేయి చేయి కలిపి ప్రజల జీవితాలపై భీభత్స నృత్యం చేస్తున్నవి.

సాహితీ సాంస్కృతిక రూపాలలో పతన విలువలు భయంకరంగా ప్రజల జీవితాలతో చెలగాట మాడుతున్నాయి. అశ్లీల చిత్రాలూ, సాహిత్యమూ, హింసా, ద్వేష తత్వాన్ని వ్యాపింప చేస్తోంది. స్త్రీలపై భౌతిక హింసలూ, అత్యాచారాలూ పెరగడానికివి ప్రత్యక్షంగా కారణమవుతున్నాయి. డబ్బు సంస్కృతి, అమానవీయ తత్వాన్ని వ్యాపింప చేస్తున్నాయి.

ఇటువంటి పతన విలువలను, వాటిని ప్రోత్సహిస్తున్న ప్రభుత్వ విధానాలను ఈ ఐక్యతా సదస్సు తీవ్రంగా ఖండిస్తోంది. దోపిడీ వ్యవస్థ అంతంతోనే పతన సంస్కృతి అంతమౌతుందనే యాంత్రిక వాదాన్ని తిరస్కరిస్తూనే నూతన సంస్కృతి కోసం పోరాడుతూ, వ్యవస్థ మార్పును మనసా, వాచా, కర్మణా ఆహ్వానిస్తున్నది.

ఈ ఐక్యతా సదస్సు పతన సాంస్కృతిక విలువలకు వ్యతిరేకంగా ఉద్యమాన్ని నడపాలని నిర్ణయిస్తోంది. అందులో కలసి వచ్చే అన్ని రకాల ప్రజా సంఘాలతో, వ్యక్తులతో సమైక్యమై ఐక్య కార్యాచరణను సాగించమని అరుణోదయ, జనసాహితి కార్యవర్గాల్ని ఈ సదస్సు ఆదేశిస్తోంది.

## సాంఘిక దురాచారాలను ఖండిస్తూ

రోజు రోజుకూ మనం నివసిస్తున్న సమాజం దుర్భరంగా, కష్టభూయిష్టంగా, కంటకావృతంగా తయారయింది. జడలు విచ్చిన సుడులు రెచ్చిన కరాళ నృత్యం సామాన్యుని జీవనాన్ని నిరంతరం దుర్గమం చేస్తోంది. సామ్రాజ్యవాదం బార్లా తెరిచిన గేట్ల ద్వారా భారత గడ్డ పైన పొంగిపోయి మురికాల్వలై ప్రవహిస్తూ మన జీవితాన్ని దుర్గంధ భూయిష్టం చేస్తున్నది. ఇక్కడ ప్రజావ్యతిరేక భూస్వామ్య

సంస్కృతి సామ్రాజ్యవాద విశృంఖల సంస్కృతితో నిస్సిగ్గుగా విలాఖతయిన (ఆర్థిక రంగంలో లాగే) ఫలితంగా వికృతమైన విలువలు, లంపెన్ సంస్కృతి విజృంభిస్తున్నాయి. దీని పర్యవసానంగానే దళితులపై, స్త్రీలపై, అణచివేయబడ్డ వర్గాలపై అత్యాచారాలు సర్వ సాధారణమైనవి. మనిషి కన్న ఎప్పుడైతే వస్తువు ప్రాముఖ్యత పొందుతుందో, తత్ఫలితంగా ఉత్పన్నమయే వినియోగ సంస్కృతి మధ్య తరగతినీ, పీడితులనీ బలి పశువులుగా ఎంచుకుంటుంది. అందుకే పరకట్న చావుల్లో ఎక్కువగా మధ్య తరగతికీ, దిగువ మధ్య తరగతికీ చెందిన ఆడపడుచులు బలి కావడం గమనార్హం. అత్యాచారాలకు గురయే స్త్రీలూ ప్రధానంగా పీడిత వర్గానికి చెందిన వారే. మొత్తం మీద భయంకరంగా వ్యాపిస్తోన్న దుర్మార్గమైన బూతు తెలుగు సినిమా సంస్కృతి వల్లా, సామ్రాజ్యవాద భూస్వామ్య విలువల విజృంభణ వల్లా మానవత్వం నశించిపోయి సాంఘిక దురాచారాలు పెరిగిపోయినయి.

ఈ ఐక్యతా సదస్సు, పెరిగిపోతున్న సాంఘిక దురాచారాల్ని నిర్ద్వంద్వంగా ఖండిస్తున్నది. ఉన్నత మానవ విలువలకు నిలబడుతానని, కొత్త మానవుణ్ని సృష్టించే క్రమంలో మహోన్నత సంస్కృతి కోసం పోరాడుతానని ప్రతిన బూను తున్నది.

## విశాల ఐక్యతకై విజ్ఞప్తి

రోజు రోజుకు కృష్ణ పక్ష చంద్రునిలా క్షీణించి పోతున్న దేశ ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితులు, దేశంలో ఒక నూతన ప్రజాతంత్ర సమాజాన్ని స్థాపించాలని పోరాడుతున్న విప్లవ శక్తుల మధ్య ఐక్యతను అనివార్యం చేస్తు న్నాయి. పెరిగి పెరిగి మేరు నగమైన దోపిడి వ్యవస్థను నేలమట్టం చేయడానికి ఈ ఐక్యత దోహదం చేస్తుంది. ముఖ్యంగా సాంస్కృతిక రంగంలో పతనమైన దోపిడి విలువలకు వ్యతిరేకంగా నూతన ప్రజాస్వామిక సంస్కృతి కోసం పోరాడు తున్న సాంస్కృతిక సైనికుల మధ్య ఐక్యత ఎంతో అవశ్యం. దోపిడీ పాలక వర్గాలు ప్రయోగిస్తున్న క్రూర నిర్బంధ కాండను, సాంస్కృతిక దాడులను ప్రతిఘ టించాల్సిన అవసరం అటు ప్రజాఉద్యమ రంగంలోనే కాకుండా, ఇటు సాంస్కృతిక రంగంలోనూ ఎంతో అవశ్యం. కాబట్టి అరుణోదయ, జనసాహితి సంస్థలు విశాల విప్లవ సాంస్కృతికోద్యమంలో పని చేస్తున్న ఇతర సాంస్కృతిక సంఘాలకు, వ్యక్తులకు ఒక ఐక్య వేదికపై కలిసి రావాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాయి.

చరిత్ర మన భుజ స్కంధాలపై వేసిన బాధ్యతను మనం సక్రమంగా నిర్వర్తించక పోతే, భవిష్యత్తు మనను వేలెత్తి చూపిస్తుందనే చేదు వాస్తవాన్ని ఈ సదస్సు గుర్తు చేస్తున్నది.

ఐక్యమౌదాం !　　　　　　　మరింత సంఘటితంగా పోరాడదాం ! !

# జనసాహితి - అరుణోదయల పునర్నిర్మాణ ఐక్యతా సదస్సు, ఐక్యతా సభ రిపోర్టు

## 30 జూన్ 1992 తేదీన విజయవాడ, కా॥ నూతన్ నగర్ (హనుమంతరాయ గ్రంథాలయం) లో

గత నాలుగైదేళ్ళుగా ప్రజా సాహితీ సాంస్కృతిక ఉద్యమంలో కృషి చేస్తున్న ఇతర రచయితల, అభ్యుదయ, సాంస్కృతిక సంస్థలతో పాటు ఐక్య కార్యాచరణలో సత్ఫలితాలు సాధించిన జనసాహితి, గత రెండేళ్ళ కాలంలో అరుణోదయతో నిర్వహించిన ఉమ్మడి కార్యక్రమాల పరంపర ద్వారా సాధించిన ఐక్యతా వాంఛ 92 జూన్ 30వ తేదీకి పరాకాష్ఠకు చేరి, ఈ రెండు సంస్థలూ పునర్నిర్మాణమై ఐక్యమై పోయాయి. ఇది ప్రజా సాహితీ సాంస్కృతికోద్యమ చరిత్రలో ఒక మైలు రాయి లాంటిది.

ఈ చారిత్రాత్మక ఐక్యతా సదస్సు 92 జూన్ 26న బూటకపు ఎన్‌కౌంటర్‌లో మరణించిన విరసం సభ్యుడు, ప్రజా కవి కామ్రేడ్ నూతన్‌ను సంస్మరిస్తూ కా॥ నూతన్ నగర్ (విజయవాడ - హనుమంతరాయ గ్రంథాలయ భవన సముదాయం) లో జరిగింది. ప్రారంభ సభ, ప్రకాశికల చర్చ, సాంస్కృతిక ప్రదర్శనలు మొదలయినవి జరిగిన ఆడిటోరియం హాలుకు 'సుంకర-వాసిరెడ్డి' హాల్ అని పేరు పెట్టుకొని ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమానికి వారు చేసిన కృషిని జ్ఞాపకం చేసుకున్నాం.

92 జూన్ 30 న ఉదయం 10-30 గం. లకు జనసాహితి-అరుణోదయ పతాకావిష్కరణతో ఐక్యతా సదస్సు ప్రారంభమైంది. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన రెండు వందల మంది ప్రతినిధులు "ప్రజా సంస్కృతి వర్ధిల్లాలి!" "ప్రజా సాహిత్యం వర్ధిల్లాలి!", "భూస్వామ్య,సామ్రాజ్యవాద సంస్కృతి నశించాలి!" "అమర కళావేత్తలకు జోహార్లు!" మొదలైన నినాదాల హోరులో జనసాహితి కార్యవర్గ సభ్యుడు డా॥ సూర్యసాగర్ పతాకాన్ని ఆవిష్కరించారు. "ఓ అమర కళావేత్తలారా!" పాటను అందరూ గొంతెత్తి పాడి, అమరులైన ప్రజా రచయితలకు, కళాకారులకు జోహార్లు అర్పించారు.

ఆ తరువాత జరిగిన ప్రారంభ సభకు అరుణోదయ రామారావు అధ్యక్షత వహించారు. ఆయన తన ప్రసంగంలో గత ఇరవై సంవత్సరాలుగా విడివిడిగా వున్న ఈ రెండు సంస్థలూ గత రెండేళ్ళుగా కలిసి పనిచేస్తూనే వున్నా, నేడు

లాంఛనంగా ఐక్యమవుతున్నాయని చెప్పారు. ఈ రెండు సంస్థలూ ఐక్యమవడమే కాక, మిగిలిన సంస్థలతోనూ, ప్రజానుకూల, ప్రగతిశీల భావాలున్న వ్యక్తులతోనూ స్నేహపూరిత సంబంధా లేర్పరచుకోవా లన్నారు. ఆ తర్వాత కామ్రేడ్ శశి ఈ ప్రాంగణానికి కా॥ నూతన్ నగర్ అని పేరు ఎందుకు పెట్టుకున్నామో, కామ్రేడ్ నూతన్ కళా, సాహిత్య రంగాలలో చేసిన కృషిని వివరించారు. ఛాందస కుటుం బంలో జన్మించిన నూతన్ రాసిన పాటల్లో తత్వాల బాణీ ఎక్కువగా కనబడేది. విప్లవోద్యమ అవసరాల రీత్యా విరివిగా పాటలు రాసేవాడు. బతికి వుంటే మంచి కథా రచయితగా ఎదిగి వుండేవాడు. కోపమనేది ఏ కోశానా ఎరుగనివాడు. ఆయన నుంచి నేర్చుకోవాల్సిన విషయాలెన్నో వున్నాయన్నారు. కుటుంబ బాంధవ్యాల కంటే ఉద్యమ బాంధవ్యాలే మిన్న అని నూతన్ ఆచరణలో ఋజువు చేసాడనీ, ఉద్య మంలో చేరిన తర్వాత దశాబ్దం పైగా ఇంటికే పోలేదనీ, చివరకు తండ్రి మరణ వార్త విని కూడా చలించని నూతన్, తన సహచరుల ఇబ్బందులను చూసి అత్యంత మానవతా దృక్పథం చూపేవారనీ చెప్తూ, తాను నూతన్‌తో కలిసి రాసిన ఒగ్గు కథనీ, పాటనీ దుఃఖంతో, ఉద్వేగంతో నిండిన గొంతుతో విన్పించారు. తర్వాత కా॥ దివికుమార్, సుంకర, వాసిరెడ్డి చేసిన సాహిత్య కృషిని, సాంస్కృతిక కృషిని వివరించారు.

ఆ తర్వాత ముఖ్య అతిథిగా వచ్చిన ఒకనాటి ప్రజా నాట్యమండలి కళా కారుడు వల్లం నరసింహారావు గారు మాట్లాడుతూ, చీలికలు పీలికలైన ప్రజా సంస్థలు ఐక్యం కావటం చాల మంచి పరిణామం అన్నారు. ఇంతవరకూ కమ్యూనిస్టు ఉద్యమం చీలడమే కాని కలవడమన్నది జరగలేదు. ఈ చీలికలు తమ లాంటి వాళ్ళ నెందరినో కృంగదీసాయనీ, ఈ సాంస్కృతిక సంస్థల ఐక్యత ఇంకా విస్తరించాలని అభిలషించారు. "ఒక డప్పు వాయిస్తే పేలవంగా వుంటుంది. పది డప్పులు ఒకేసారి వాయిస్తే ఎంతో శక్తివంతంగా వుంటుంది." కనుక ఈ ఐక్యతా సదస్సును ప్రారంభించడం నాకు నూతనోత్తేజాన్నిస్తోంది. నా వయసే కనుక ఇప్పుడు 14, 15 ఏళ్ళు అయి వుంటే, ఆ సినిమా రంగాన్ని వదిలేసి మీతో కలిసి పోవాలన్నంత ఉత్తేజం కల్గుతోంది.

"అదీగాక నా కళా రంగ జీవితం - నా పధ్నాలుగేళ్ళ వయసులో సుంకర రాసిన 'ముందడుగు' నాటికలో స్త్రీ పాత్ర ధరించడంతో ప్రారంభమైంది. అదీ ప్రస్తుతం ఈ ఐక్యతా సదస్సు జరుగుతున్న హనుమంతరాయ గ్రంథాలయంలోని ఈ వేదిక పైనే ఆ ప్రదర్శన జరిగింది. ఇది యాదృచ్ఛికమే అయినా - దీనివల్ల ఆనాటి మా కృషి, అనుభవాలు, ఒడుదుడుకులు-అన్నీ గుర్తుకు వస్తున్నాయి. 'ఎవరో నాలాగా ఆడ వేషం వేస్తున్నారట-చూద్దాం' అని స్థానం నరసింహారావు గారు ఆనాడు ఆ నాటకం చూడటానికి ప్రేక్షకునిలా వచ్చారు.

"'సుందదుగు' నాటకాన్ని ప్రభుత్వం నిషేధించింది. సుంకర-వాసిరెడ్డి జంటలో వాసిరెడ్డికి గుండె జబ్బు వుండటంతో ఎక్కువగా తిరిగేవాడు కాదు. సుంకర తెలంగాణ జిల్లాల్లో పర్యటించి, అక్కడి జీవితాన్ని అధ్యయనం చేసి, 'మా భూమి' నాటకాన్ని రాసారు. తెలంగాణ యాస వుండే యల్లమంద పాత్రని సృష్టించారు. అప్పట్లో దాదాపు 16 గంటల సేపు రిహార్సల్స్ ఏకబిగిని వేసే వాళ్ళం" అంటూ ఆనాటివారి కృషిని వివరిస్తూ, మధ్యమధ్యలో తన గంభీరమైన స్వరంతో 'మాభూమి' నాటకంలోని "భాయీ! బందగీ!" అనే పాటనూ, ఆత్రేయ నాటికలోని "మేలుకో! పీడిత ప్రజల ఆశాజ్యోతీ!" అనే పాటనూ, "నేనూ ఒక సైనికుణ్ణి, శాంతి సమర సైనికుణ్ణి" అనే పాటనూ, ఇలా ఇంకా ఎన్నెన్నో పాటలను పాడి ప్రతినిధులలో ఉత్తేజాన్ని నింపారు. ప్రెస్ వర్కర్స్‌కు సంబంధించిన నాటికను డా॥ రాజారావు గారు రూపొందించడాన్నీ, దాని నేపథ్య గేయాన్నీ వివరించారు.

"ఈనాడు ఈ రంగంలో కృషి చేస్తున్న సంస్థలన్నీ ఐక్యమవ్వాలనీ, ఒకరిపై ఒకరు బురద చల్లుకోవడాన్ని మానాలనీ, ఇన్ని చీలికల్లోనూ ఏదో ఒకటి సరైన దారిలో ప్రయాణం చేస్తూ వుంటుందన్న నమ్మకం వ్యక్తం చేస్తూ, అరవై ఐదేళ్ళ వయసు వున్నా, ఈ రంగానికి అవసరమైన శిక్షణ కార్యకర్తలకు ఇవ్వడానికి సంసిద్ధత వ్యక్తపరిచారు. ఈ సంస్థలన్నీ కలసి మతోన్మాదం, ప్రాంతీయతత్వం, సామ్రాజ్యవాదం వంటి అంశాలపై పోరాటం సాహితీ, సాంస్కృతిక రంగాల్లో సాగించా"లని సందేశమిస్తూ ముగించారు.

జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రధాన కార్యదర్శి, ఇరవై ఏళ్ళ సాహితీ సాంస్కృతికరంగ కృషిని సమీక్షిస్తూ, ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమం 1943లో ప్రారంభమవడాన్ని, ఆ తర్వాత అది 1955 నాటికి స్తబ్దతకు గురి కావడమూ, 1968-69లో నక్సల్‌బరీ-శ్రీకాకుళం ఉద్యమాలు రచయితలనూ, కవులనూ, కళాకారులనూ 'మీరెటువైపు' అని ప్రశ్నించాయి. ఫలితంగా విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది. అది పెడ ధోరణికి గురయింది. అంతరంగిక పోరాటం జరిగింది. కొందరు బయటకు వెళ్ళారు. ఇంకా సంఘంలో అంతరంగిక పోరాటం సాగుతోంది. వివిధ ప్రజాసంఘాల నుంచి బయటకు పోయినవారు వ్యక్తిగత పోకడలు కలిగినవారే తప్ప, సంస్థాగత క్రమశిక్షణకు కట్టుబడలేని వారున్నారు. చివరకు ఈ ప్రజాసాహితి సాంస్కృతికోద్యమంలో నుంచి నిష్క్రమణలూ, బహిష్కరణలూ, ఉద్యమానికి బయట వుండి రచనలు చేస్తున్న రచయితలు సంఘాల్లో చేరకుండా కృషి చేసే స్థితికి దారితీసాయి. అదీగాక ఈ బయట వున్న వారిలో కొందరు ప్రజా దృక్పథంతో రచనలు సాగిస్తున్నా అపరిమితమైన పరిమితుల్లో వుంటూ, మినహాయింపులు కోరుతూ ఫ్రీలాన్స్ విప్లవ రచయితలుగా చలామణి అవుతున్నారు.

"ప్రజా దృక్పథాన్ని వంటబట్టించుకోకపోతే, అహంకార ధోరణులు తలెత్తి

ఉద్యమం ముక్కలు చెక్కలు అవుతుంది. తాము రచయితలుగా, ఉపన్యాసకులుగా, నాయకులుగా అభివృద్ధి కావడానికి కారణం ప్రజలేననీ, సంపద సృష్టిస్తున్న ప్రజలకు తాము కృతజ్ఞులై వుండాలనీ", కా॥ రవిబాబు విజ్ఞప్తి చేసారు.

గత ఇరవయ్యేళ్ళ కాలంలో సాహిత్య పరంగా 'ప్రజాసాహితి' మాస పత్రికను నడపడమే గాక, దాదాపు నలభై గ్రంథాలను జనసాహితి ప్రచురించిందనీ, అరుణోదయ, జనసాహితి కళాకారులు సాంస్కృతిక పరంగా ఒగ్గుకథ, వీధి భాగవతం, పాములవాడు, జంతర్ పెట్టె, ఆశు కవిత, గారడీ, వీధి నాటకం, మొదలైన ఎన్నో కళా రూపాల్లో ప్రదర్శనలు రూపొందించి ప్రదర్శించారనీ, ఇవిగాక గాయకులకూ, రచయితలకూ ఎన్నో శిక్షణా శిబిరాలు నిర్వహించాయనీ కా॥ రవిబాబు వివరించారు.

"జనతా ప్రజాతంత్ర విప్లవాన్ని విజయవంతం చేయడానికి సాహితీ సాంస్కృతిక రంగాల్లో ఐక్య సంఘటనా దృక్పథాన్ని అవలంబిస్తూ ముందుకు సాగుతూ, పునర్నిర్మాణమై, ఐక్యమౌతున్న ఈ సంఘటన ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమంలో మరో మూల మలుపు లాంటి"దని ఆయన అన్నారు.

రైతుకూలీ సంఘం నాయకులు కా॥ మండ్ల సుబ్బారెడ్డిగారు సందేశమిస్తూ, 1975లో అనంతపురంలో చీలిక ఉద్యమం ఈనాడు విజయవాడలో చీలిక వదిగమించి ఐక్యతా క్రమం ప్రారంభం కావడం హర్షించదగిన పరిణామం అన్నారు. తాను కమ్యూనిస్టు పార్టీలోకి గోర్కీ నవల 'అమ్మ' చదవడం ద్వారా ఆకర్షితుడనయ్యాననీ, 1947 లో డా॥ రాజారావు బృందం 'మా భూమి' నాటకాన్ని చూచి ముగ్ధుడనైనాననీ, శ్రీశ్రీ గీతాలు మమ్మల్ని ఉత్తేజ పరిచాయన్నారు. ముక్కామల నాగభూషణం రాసినపాట వేగరావోయ్ కార్మికా! "వేగరావోయ్ కర్షకా" ఇప్పటికీ మమ్మల్ని ఉత్తేజ పరుస్తోంది. తుమ్మల వెంకటరామయ్యగారు రాసిన అనేక కవితలు పాటలు పరిశీలించి వాటిని విశ్లేషించి ప్రచారం చేయాల్సిన బాధ్యత ఈ సంఘాలకు వుందని గుర్తుచేసారు.

"ప్రాథమికంగా భిన్నాభిప్రాయాలు లేకపోయినా, ఆచరణలో వున్న తేడాలతో ఇన్నేళ్ళుగా చీలివున్నాం. గత మూడేళ్ళుగా ఉమ్మడిగా కార్యక్రమాలు నిర్వహిస్తూ ఈ సంఘాల్లోని కళాకారులూ, రచయితలూ ఐక్య భావనను పెంపొందించుకున్నారు. "మీరుఐక్యమై కృషిచేస్తారా, చేయరా?"అని ప్రజలు డిమాండ్ చేస్తున్నారు. ఈ ఐక్యతను ఆహ్వానిస్తూ, సామ్రాజ్యవాద సంస్కృతి, సామ్రాజ్యవాద పీడనకు వ్యతిరేకంగా సమైక్యంగా కృషి చేయాలని కా॥ సుబ్బారెడ్డిగారు తమ సందేశంలో పిలుపునిచ్చారు.

వర్కర్స్ సాలిడారిటీ నాయకులు కా॥ గణపతిరావు ఈ ఐక్యతపట్ల హర్షం వెలిబుచ్చుతూ, కార్మిక సంస్కృతి ఏవిధంగా వుంటుందో ప్రజలకు సాహితీ,

సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా తెలియ చేయాలన్నారు.

ఓ.పి.డి.ఆర్.నాయకులు కా॥ పి. కోటిరెడ్డి మాట్లాడుతూ భావప్రకటనా స్వేచ్ఛ
పైనా, ప్రజా ఉద్యమాలపైనా జరుగుతున్న దాడులను ఖండించారు. గిరిజన సాయుధ
రైతాంగ ఉద్యమాలకు, ప్రజాఉద్యమాలకూ ప్రజాస్వామ్య హక్కుల ఉద్యమాని
సంఘీభావంగా రచయితలూ, కవులూ, కళాకారులూ, తమ కలాల్ని, గళాల్ని క
లించి విస్తృతంగా గతంలో ప్రచారం చేసారు - ఇక ముందు మరింత విస్తృతంగా
చేయాలని విజ్ఞప్తి చేసారు.

విరసం కార్యవర్గ సభ్యుడు కా॥ నారాయణస్వామి సందేశమిస్తూ, తాన
కా॥ నూతన్‌పై రాసిన కవిత "ఇప్పుడు నేను సహజ మరణాల గురించి మాట్లా
లేను" చదివారు.

చివరగా సుంకర సత్యనారాయణగారి సోదరుడు సుంకర శివరామయ
గారు మాట్లాడుతూ తాము చిన్నపుడు 'పాంచజన్యం' అనే పుస్తకంలో
పాటలు పాడుకునే వాళ్ళమనీ, కయ్యూర్ కామ్రేడ్స్‌పై వచ్చిన పాట బా
ప్రచారంలో వుండేదనీ, అప్పట్లో మైకులులేవు గనుక మెగాఫోన్ తీసుకొ
పాడేవాళ్ళమనీ ఆనాటి జ్ఞాపకాలు ప్రతినిధులకు వివరించారు. ఉప్పు సత్యా
గ్రహంలో పాల్గొనడానికి సుంకర సత్యనారాయణ ముందుకు వస్తే, మా తండ్రిగా
ఒక షరతు విధించారు. "ఎన్ని కష్టాలు వచ్చినా రెండేళ్ళవరకూ వెనక్కి తిరి
రాగూడదు ఇది అంగీకారమైతే వెళ్ళమన్నారు" అని సుంకర జీవితాన్ని మలు
తిప్పిన ఘట్టాన్ని వివరించారు.

దీనితో మధ్యాహ్నం 2-00 లకు ప్రారంభ సభ ముగిసింది. మధ్యమధ్యల
అరుణోదయ గాయకులు ఉత్తేజకరమైన పాటలు పాడారు.

మరల సాయంత్రం 4-30 కు ప్రారంభమైన ప్రతినిధుల సమావేశం
ముందుగా జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య, సర్వసభ్య సమావేశంచేసిన ఐక్య
తీర్మానాన్ని సమాఖ్య ప్రధాన కార్యదర్శి కా॥ రవిబాబు, అరుణోదయ ఆర్గనైజిం
కమిటీ వారితీర్మానాన్ని కా॥ రాజారావు, అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య తీర
నాన్ని కా॥ రామారావు చదివి విన్పించారు.

ఆ తర్వాత కా॥దివికుమార్ గత మూడేళ్ళుగా ఐక్యంగా నిర్వహించిన వివి
కార్యక్రమాలను వివరించి, ఈ ఐక్యతకు వచ్చిన క్రమాన్ని, నేపథ్యాన్ని వివరిం
ఐక్యతా ప్రకటనను చదివారు. ఆ తర్వాత జనసాహితి, అరుణోదయల ప్రణా
నిబంధనావళి ముసాయిదాలను కా॥ రవిబాబు, కా॥ రామారావు చర్చకై ప్ర
పెట్టారు. కొన్ని మార్పులతో ఈ ప్రణాళికలను అందరూ నిలబడి సుదీర్ఘమైన
తాళ ధ్వనులతో అంగీకరించారు.

ఆ తర్వాత జనసాహితి, అరుణోదయ సభ్యులు విడివిడిగా సమావేశమై తమ కార్యవర్గాలను ఎన్నుకున్నారు.

సాయంత్రం 8-00 గంటలకు జరిగిన బహిరంగ సభకు అరుణోదయ అధ్యక్షుడు కా॥దివికుమార్ అధ్యక్షతవహించారు. ప్రముఖసాహితీవిమర్శకుడు శ్రీఅద్దేపల్లి రామమోహనరావు మాట్లాడుతూ "ఉద్యమం అనే పదం గురజాడ ఉపయోగించారు. పీడిత ప్రజల పక్షాన నిలచినవారి ఉద్యమమే ఉద్యమం. ఇది ఒక అంశం కాగా, కొందరు కవులు స్థిరమైన జీవన దృక్పథం లేకుండానే, విప్లవంపై మోజుతో విప్లవ కవిత్వం రాస్తున్నారు. విప్లవాన్ని అభిమానించే కవి అస్పష్టతను ఆశ్రయిస్తే యువకవులూ అదే బాటలో పోతారు. అతని శైలినే అనుకరిస్తారు. ఎందుకంటే ఆ కవిపై మోజు పెంచుకోవడం వల్ల సిద్ధాంత పునాది కల్గినవాడే తనదైన శైలిలో, శిలో సాహిత్యాన్ని సృష్టించగలడు.

"భావాలు వేరు-భావజాలం వేరు. భావజాలం అంటే ideology. భావాలు ప్రకటించడం అనుభూతుల కవులు చేస్తున్నారు. భావజాల పునాదిపై ఆధారపడిచేసిన రచనే శక్తివంతంగా, సరైనదిగా వుంటుంది" అన్నారు.

ఆ తర్వాత వల్లం నరసింహారావుగారు మాట్లాడుతూ తమిళమహారాణి వెండి సింహాసనంతో తన బల ప్రదర్శన చేయడం గురించి సునిశితంగా విమర్శించారు. 'పరివర్తన' నాటకంలో ఆత్రేయ రాసిన "ఓ కవీ! స్వప్నవీధుల విహరించేవా? వాస్తవ జగతికి దిగిరావా?" పాట సందర్భోచితంగాపాడి ప్రేక్షకులను ఉత్తేజపరిచారు.

విరసం కార్యవర్గ సభ్యుడు ప్రముఖకవి కా॥ నారాయణస్వామి ప్రసంగిస్తూ, ఈనాడు నూతన్ రక్తం నుంచి నూతనంగా ప్రభవించిన జనసాహితి, అరుణోదయ సంస్థలను అభినందించారు. ఈనాడు మనిషికి-మనిషికి మధ్యవున్న సంబంధాలు కేవలం మార్కెట్ సంబంధాలుగా మారిపోయి, మన జీవిత విలువలు మార్కెట్ సంబంధాలుగా మారిపోయి, మన జీవిత విలువలు మార్కెట్ సంస్కృతిగా మారిపోతున్నట్లు ఈనాటి ఆర్థిక వ్యవస్థ చేస్తోందన్నారు.

తన సుదీర్ఘమైన ప్రసంగంలో కా॥ నారాయణస్వామి ఈనాటి రాజకీయ వాతావరణాన్ని ఎండగడుతూ - జనసాహితి, అరుణోదయలు ఒక సాంస్కృతిక ఉద్యమాన్ని నిర్మించాలన్నారు.

ఈ సమావేశం చేసిన తీర్మానాలను కా॥ దివికుమార్ వివరించారు.

బహిరంగసభ అనంతరం అరుణోదయ, ఒంగోలు శాఖవారు 'జనవిజయం' సాహిత్యరూపకాన్ని, అరుణోదయ విజయవాడ శాఖవారు 'అప్పుల భారతం' -వీధి భాగవత యక్షగానాన్ని ప్రదర్శించారు.

## జనసాహితి రాష్ట్ర కార్యవర్గం

1. సూర్యసాగర్ : అధ్యక్షుడు
2. కొత్తపల్లి రవిబాబు : ప్రధానకార్యదర్శి
3. సురేష్ : సంయుక్త కార్యదర్శి
4. చిత్ర : కోశాధికారి
5. నిర్మలానంద : ప్రజాసాహితి వర్కింగ్ ఎడిటర్
6. శశి కార్యవర్గ సభ్యుడు
7. ఛాయరాజ్ ,,

## అరుణోదయ రాష్ట్ర కార్యవర్గం

1. దివికుమార్ : అధ్యక్షుడు
2. సుంకన్న : ఉపాధ్యక్షుడు
3. రాజారావు : ఉపాధ్యక్షుడు
4. రామారావు : ప్రధాన కార్యదర్శి
5. కృష్ణ : సహాయ కార్యదర్శి
6. ఉదయ్ : సహాయ కార్యదర్శి
7. గోవిందరావు : కోశాధికారి
8. గోవర్ధన్ కార్యవర్గ సభ్యుడు
9. వెంకటయ్య ,,
10. రాములు ,,
11. శ్రీనివాస్ ,,

జనసాహితి, అరుణోదయ సభ్యులుగా చేరదలచినవారు, నూతన ప్రణాళిక, నిబంధనావళి కొరకు ఈ క్రింది వారికి రాయవచ్చు.

జన సాహితి అడ్రసు :

కొత్తపల్లి రవిబాబు, నగరం Po, గుంటూరు జిల్లా-522278.

అరుణోదయ అడ్రసు :

దివికుమార్, C/o ప్రజాసాహితి, 29-28-67 దాసరివారివీధి,
సూర్యారావుపేట, విజయవాడ-2.

---

## కృతజ్ఞతలు

ఐక్యతా సదస్సు విజయవంతం చేయడానికి ఆర్థికంగా, హార్దికంగా సహకరించిన వారందరికీ జనసాహితి, అరుణోదయలు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాయి.

కవిత :

# మృత్యువును ద్వేషిద్దాం

—నారాయణస్వామి

క్షమించండి
ఇప్పుడు మేము సహజ మరణాల గూర్చి మాట్లాడలేము
ఇక్కడ ఒక మనిషి
సహజంగా చచ్చిపోగలడనే నమ్మకం సడలిపోయిన వాళ్ళం
క్షమించండి
ఇక్కడ కవులు సహజంగా చచ్చిపోతారనే నమ్మకం ఏమాత్రం లేనివాళ్ళం
కవులు మృత్యువును ద్వేషించినపుడు
జీవితాన్ని పోరాటంలో పదునెక్కించినపుడు
సహజమరణాన్ని వరించగలరనే ఆశలేమాత్రమైనా లేనివాళ్ళం.
క్షమించండి
ఇది అసహజ మరణాల వ్యవస్థకదూ
ఇది రోగగ్రస్త మృత్యు కుహరం కదూ
ఇక్కడ ఎవరూ మామూలుగా ఎట్లా చావగలరు?
క్షమించండి
జీవితాన్ని కబళించే అకాలమృత్యువును మనసారా ద్వేషిస్తున్న వాళ్ళం
ఇంక కవి చచ్చిపోయేడని అనడం మా కిష్టంలేదు
కవి చంపబడ్డాడు
వీరుడైన కవియోధుడు కాల్చి చంపబడ్డాడు.

*　　*　　*

మేము వెన్నెలని మిక్కుటంగా ప్రేమిస్తాం
స్వచ్ఛమైన వెన్నెలమీద పరుచుకునే నెత్తుటి మరకల్ని అసహ్యించుకుంటాం
మేము ప్రాణం కన్నా మిన్నగా వెలుగుని ప్రేమిస్తాం
వెలుగుని మింగేస్తోన్న చీకటి ఛాయలని మేము ద్వేషిస్తాం-
మేము జీవితాన్ని ప్రేమించి అక్కున చేర్చుకున్న వాళ్ళం
జీవితం కోసం ప్రాణాల్ని పణంపెట్టిన వీరుల్ని వూపిరికన్న మిన్నగా
హృదయంలోకి పిలుస్తాం-

మా సహజాతాల్ని
చల్లని మలయమారుతంలా తాకినవాడా
మా మంచు పెదవులపై వెచ్చని దరహాసమై సోకిన వాడా
నీవు గంభీరంగా నిష్క్రమించినాక
నిరంతరం చెమ్మగిల్లే మా కనుచెలిమల్లో భవిష్యదాశై వూరే వాడా
వీరుడా! వీరుడా! నూతన మానవుడా!!
రాకరాక వచ్చిన వర్షానివి నీవు
వర్షమెలిసింతర్వాత కనురెప్పల చిగురుటాకుల దోనెలపై
తూగాడే నీటి ముత్యానివి నీవు
సుదూర తీరాల్లో వినిపిస్తోన్న పాట కోసం
గజ్జె కట్టి ఆడింది నీవు
గాలిలో కల్సిపోయిన పూల పుప్పొడి తరగలపై
కొంగ్రొత్త కవిత్వపు అడవుల వచ్చదనాన్ని లిఖించిన
ఆదివాసివి నీవు
ప్రజలపై వల్లమాలిన ప్రేమతో
సంకుచిత సంబంధాలని తృణప్రాయంగా ఎంచి
తుపాను తర్వాత నిండుగా ప్రవహించే గోదావరిపై
ప్రజల మదుళ్ళపై వికసించిన
నీ జీవితం ముందు వినమ్రులమౌతున్నాం-
వీరుల జీవితాన్ని అసహజంగా తుంచేస్తున్న
అక్రమ ధనార్జనా ఖాకీ వ్యవస్థ ముఖమ్మీద
రక్తంలోని ద్వేషాన్నంతా నోట్లో నింపుకుని తుపుక్కున వుమ్మేస్తాం.

---

వం పాట :

---

## త్యాగాల మందారం వేణన్న

అడవి తల్లి నిండు గుండెల్లో గూడై
పొంగేటి వాగుల్లో నెత్తురు గుర్తయ్యి
గోండన్న చేతుల్లోన వేణన్న మావేణన్న
రగల్ జెండా పైతివా వేణన్న

కత్తుల వంతెన కరీంనగర్ పోరు
కన్నతల్లయి నీకు ఉగ్గుపాలందించే
బంధనాలను దెంచినావు వేణన్న మావేణన్న
కొండలంద జేరినావు వేణన్న ||అడవి||

పేదోడి బాధను వాని యాసలోనే
కలం పట్టి నీవు కతలు రాసినావు
రాసిన రాతలన్ని వేణన్న మావేణన్న
రస్తాలో జూపినావు వేణన్న ||అడవి||

పేద ప్రజలే నీకు చుట్టాలు బంధువులు
వర్గ పోరు నీకు అసలైన జీవితం
కామ్రేడ్స్ మిత్రులంతా వేణన్న మావేణన్న
నీ పంచ ప్రాణాలన్న వేణన్న ||అడవి||

కోపమంటే నీకు కోసెడు దూరం
చిరునవ్వే నీకున్న విలువైన ఆస్తన్న
విప్లవాల తోటలో వేణన్న మావేణన్న
త్యాగాల మందారం వేణన్న ||అడవి||

లుచ్ఛా పోలీసులు పట్టి బంధించారు
గఢపూర్ గట్లల్లో కట్టేసి కాల్చారు
గుట్టలన్ని అదిరినయి వేణన్న మావేణన్న
పిట్టలన్ని బెదిరినయి వేణన్న ||అడవి||

రైతాంగ యోధుడు వీరుడు కిరణన్న
రాలినాడు నీతో రణరంగ మందున
రైతు కూలీలందరు వేణన్న మావేణన్న
రుది జెందుతున్నరు వేణన్న ||అడవి||

దమ్ము లేని దొంగ పోలీసు కొడుకులు
చాటు మాటుగా మిమ్ము కాలబెట్టినారు
అగ్గై మండినావు వేణన్న మావేణన్న
దివిటీలై వెలిగిస్తలా వేణన్న. ||అడవి||

# నేలకొరిగిం తర్వాత....

అతడు దృఢ నిశ్చయంతోనే వున్నాడు
ఒక్క అడుగు ముందుకు వేసిం తర్వాత
శరీరమంతా తూట్లు పడిపోయింది
ఒక్కసారి నేలకొరిగిం తర్వాత
అతడు గొప్ప విశ్వాసంతోనే లేచాడు
ఒక్క ఉదుటన కుప్పకూలిం తర్వాత
గుండె నుండి స్పందనలు
గగనంలోకి మళ్ళిపోయాయి
నాడుల నుండి ప్రచోదనాలు
నేలన వలికి పోయాయి
అతడు గొప్ప స్పృహతోనే పలవరించాడు
ఒక్కసారి కళ్ళు తెరచి
కలలను విప్లవం వళ్ళోకి విసిరేశాడు
ఒక్కసారి ఊపిరిని పట్టి పట్టి
కాలం ఊపిరితిత్తెలోకి విడిచేశాడు.
గొప్ప నమ్మకంతో వుండబట్టే
మళ్ళీ పుట్టి రగుల్కొంటానని లేచాడు
అక్కడ మట్టితో బుగుల్కొని ఘట్టిగా అరిచాడు
ఒక్కసారి నేలకొరిగిం తర్వాత కూడా
అతడు దృఢ నిశ్చయంతోనే వున్నాడు
ఒక్క ఉదుటన కుప్ప కూలిం తర్వాత కూడా.

— ఛాయరాజ్

# మావేణన్న - నెత్తుటి మడుగుల సూరీడు

—ప్రతిన్

మాయన్న వేణన్న
సూడ బోయిందో
పోరుబాటలోన యోధుడయ్యిందో
పోరుబాటలోన వీరుడయ్యిందో
నెత్తుటీ మడుగుల సూరీడయ్యిందో ॥మా యన్న॥
తిమ్మాపూర్‌లోన మానేరు తల్లికి
పురిటి నొప్పుల పోరుబిడ్డవై పుట్టి ॥పు॥
సిన్నతనంలోనే బాధలన్ని జూసి
కలమెత్తి సిన్న కవితలల్లినాడు ॥క॥
కాలేజీ సదువుల సారమంతా జూసి
బతుకులేని సదువు బాగులేదన్నాడు. ॥మా యన్న॥
సిరిసిల్ల పోరులో సింఘారమైండు
కల్లోల మేఘాలు చేదించి పోరిండు ॥క॥
మానేరు వాగులో ఆలలయ్యి ఎగిసిండు
దొరల దోపిడిపైన బాకులే దించిండు ॥మా॥
ప్రజల గొంతుల్లోన పాటై మ్రోగిండు
పోరుగజ్జెలల్లో ఘల్లు, ఘల్లు మండు ॥మా యన్న॥
అంటుకొన్న ఆదిల బాదును జేరిండు
తండల్లో గిరిజనుడి గుండై పెలగిండు ॥అ॥
కాటువేసే కాళ నాగులపైన
అడవిలో అగ్గి పూలై మండిండు ॥అ॥
గుడిసె గుడిసెన రగల్ జెండై ఎగురుతూ
పల్లె ప్రజలాకు వెన్నెలా పంచిండు ॥మా యన్న॥
సిన్నబోయిన సిన్నారు తమ్ముల
చేరదీసిండు సింత దీర్చిండు ॥చె॥
తునికాకు కూలీల బాధల్ని సూసిండు
పాటల్ని పాడిండు కథలెన్నో రాసిండు ॥పా॥

(తరువాయి 76 వ పేజీలో)

వ్యా స ం :

[23-4-92 తేదీన సత్యజిత్‌రాయ్ శాశ్వతంగా కన్నుమూశారు. ఊహాలోక పుటాకాశాలలో విహరిస్తున్న భారతీయ చలన చిత్రాన్ని నిజజీవితంలోకి ఈడ్చుకొచ్చిన ఘనత సత్యజిత్‌రాయ్‌ది, ఆయనదర్శకత్వం వహించిన మొత్తం చిత్రాల్ని, "జీవితమూ - సంఘర్షణా - ప్రజా ఉద్యమం" దృక్పథంలో విశ్లేషించుకోవాల్సిన అవసరం వుంది. ఈలోగా శ్రీనవీన్ రాసిన ఈ వ్యాసాన్ని రాయ్ స్మృతి కోసం అందిస్తున్నాం-సం॥]

భారతదేశపు సాంస్కృతిక పునరుజ్జీవనంలో రాజా రామమోహనరాయ్, రవీంద్రనాథ్‌టాగూర్, మహాత్మాగాంధి, జవహర్‌లాల్ నెహ్రూ మొదలైన మహామహులు తమ తమ రంగాల్లో ఎలాంటి పాత్రల్ని నిర్వహించారో సత్యజిత్ రే కూడా తన రంగంలో అలాంటి పాత్రనే నిర్వహించాడని నిస్సందేహంగా చెప్పవచ్చు. భారతదేశ చలన చిత్ర రంగాన్ని సత్యజిత్‌రే ప్రభావితం చేసినంత ప్రగాఢంగా మరే ఇతర దర్శకుడూ చెయ్యలేదు. సినిమా కూడా సాహిత్యం, సంగీతం, చిత్రలేఖనం లాంటి కళేనని, ఈ కళద్వారా మానవుడిలోని సౌందర్యపిపాసను తృప్తి

# సత్యజిత్‌రే అపూత్రయం-ఒక విశ్లేషణ

—నవీన్

పరచటమే కాకుండా అతడిలోని మంచిని పెంచి సంస్కారవంతుడుగా రూపొందించవచ్చునని సత్యజిత్‌రే తన సినిమాల ద్వారా రుజువుచేశాడు.

సత్యజిత్‌రే 1955లో బెంగాలీ సినిమారంగంలోకి తద్వారా భారతీయసినిమారంగంలోకి ప్రవేశించేటంత వరకు భారతదేశపు సినిమాలను భారతదేశపు మేధావులెవరూ సీరియస్‌గా తీసుకోలేదు. అప్పటికే సినిమాకళ బాగా అభివృద్ధి చెందిన ఫ్రాన్స్, రష్యా, జపాన్, ఇటలీ, అమెరికా మొదలయిన దేశాల్లో భారతదేశపు సినిమాలంటే చాలా చిన్న చూపుండేది. భారతదేశపు సినిమాదర్శకులెవరికీ సినిమానొక వ్యాపారంగా తప్ప కళగా అభివృద్ధి చెయ్యటం తెలీదని సినిమా విమర్శకులు భావించేవాళ్ళు. అలాంటి పరిస్థితుల్లో సత్యజిత్‌రే మొదటిసారిగా తను దర్శకత్వం వహించి నిర్మించిన "పథేర్‌పాంచాలి" చిత్రం ద్వారా భారతీయులు కూడా మంచి చిత్రాలను నిర్మించగలరని ప్రపంచానికి రుజువు చేశాడు. తన మొదటి చిత్రంతోనే ప్రపంచంలోని మేటి దర్శకులైన రెనోయర్, ఐజెన్‌స్టీన్, చార్లీచాప్లిన్, ఆర్సన్ వెల్స్, కురసోవా, విట్టోరియా డిసీకా లాంటి వారి స్థాయిని అందుకోగల్గాడు.

ఆ విధంగా సత్యజిత్‌రే 'పథేర్‌పాంచాలి' చిత్రం ద్వారా భారతదేశ చలన చిత్ర రంగాన్ని ప్రపంచ చలన చిత్రరంగ పటంలో శాశ్వతంగా ప్రతిష్ఠించ గల్గాడు' ఈ కారణం చేతనే సినిమాను సీరియస్‌గా తీసుకునే విమర్శకులు 'పథేర్‌పాంచాలి. చిత్రాన్ని భారతదేశపు మొట్టమొదటి నిజమైన చలన చిత్రమని భావించారు.

భారతదేశంలో 'పథేర్‌పాంచాలి'కి ముందు చలన చిత్రాలను నిర్మించలేదని కాదు. చలన చిత్రాలను నిర్మించటంలో సంఖ్యను బట్టి భారతదేశం మొదట్నించీ చాలా ముందున్నది. 1895 నుండే భారతదేశంలో సినిమా ప్రదర్శనలు ప్రారంభ మయ్యాయి. అయితే అప్పట్లో ఇతరదేశాల్లో నిర్మించబడిన సినిమాలనే భారత దేశంలో ప్రదర్శించేవాళ్ళు. 1912 లో దాదాసాహెబ్‌ఫాల్కే మొట్ట మొదటి భార తీయసినిమా ను—"రాజాహరిశ్చంద్ర"ను నిర్మించాడు. ఒక భారతదేశపు దర్శకుడు ఒక భారతదేశపు కథను సినిమా అన్న-ఇదివరకెవరికీ తెలియని ఒక సరికొత్తసాంకే తిక మాధ్యమములో-చెప్పాడు, అలా "రాజాహరిశ్చంద్ర"తో భారతదేశ చలన చిత్ర చరిత్ర ప్రారంభమైంది.

*1930* లో సినిమాల్లోకి శబ్దం ప్రవేశించింది. వెంటనే ఈ శబ్దం భారతదేశపు సినిమాల్లోకి కూడా ప్రవేశించింది. 1931 లో నిర్మించబడిన 'ఆలంఆరా'తో భారత దేశంలో మూకీ చిత్రాల యుగం అంతమైపోయి టాకీ చిత్రాల యుగం ప్రారంభ మైంది. శబ్దం ప్రవేశించటంతో భారతీయ దర్శకులు శబ్దంతోటే సినిమాల్ని నింపే వారు. అడుగడుక్కీ పాటలు, నృత్యాలు, నాటకఫక్కీలో ఉండే దృశ్యాలు, సంభా షణలు, నటన మొదలైనవన్నీ చాలా కొద్ది కాలంలోనే భారతదేశపు సినిమాల్లో స్థిరపడి పోయాయి. 'పథేర్‌పాంచాలి' విడుదలయ్యేంత వరకు మనదేశపు సినిమా లన్నింట్లోను ఇదే వాతావరణం. పాటలు లేని సినిమానుగానీ, డాన్సులులేని సినిమాను గానీ, నాటక ఫక్కీలో సుదీర్ఘంగాసాగే సంభాషణలు లేని సినిమానుగానీ, నాట కంలోలాగే "ఓవర్‌యాక్టింగ్" లేని సినిమానుగానీ ప్రేక్షకులెవరూ ఊహించుకోలేక పోయేవాళ్ళు. ఇవన్నీ భారతదేశసినిమా సాంప్రదాయాలుగా మారిపోయాయి.

'పథేర్‌పాంచాలి'కి ముందు మన దేశంలో విడుదలయిన సినిమాలన్నీ ఇది వరకటి నాటకాలనే సరికొత్త సాంకేతిక మాధ్యమములో చూపించటం తప్ప అవి సినిమా మాధ్యమాన్ని సరిగ్గా అవగాహన చేసుకొని నిర్మించబడినవి కావని విమర్శ కులనటంలో తప్పేమీలేదు. ఎందుకంటే నాటకంలో నవరసాల్ని పోషించటం మన సాంప్రదాయం. సంగీతం, నృత్యం, హాస్యం, శృంగారం, వీరం, కరుణ మొదలైన వన్నీ మన నాటకాల్లో సాధారణంగా ఉంటుండేవి. సినిమాను కూడా నాటకానికి మరో కొత్త రూపమేనని మన వాళ్ళు భావించారు. కాబట్టి సినిమాల్లో కూడా ఇవన్నీ ఉండాలి. సందర్భాన్నిబట్టి పాటల్ని చేర్చటం కాకుండా పాటలకోసం సందర్భాలను సృష్టించారు. అలా పాటలకోసమే పాటలు, డాన్సులకోసమే డాన్సులు, హాస్యం

కోసమే హాస్యం, ఫైట్స్ కోసమే ఫైట్స్, శృంగారం కోసమే శృంగారం, కన్నీళ్ళ కోసమే కన్నీళ్ళు - ఇలా దేనికది వేర్వేరుగా ఉండటమే తప్ప ఇవన్నీ సినిమాలో చెప్పబడుతున్న కథలో పూర్తిగా అంతర్భాగాలై పోవటం మన సినిమాల్లో జరుగలేదు. ఈ కారణం వల్లనే భారతీయ సినిమాలు చాలా అసహజంగా, అవాస్తవికంగా, వాస్తవ జీవితంతో ఎలాంటి సంబంధంలేని వట్టి పగటికలలుగా మారిపోయాయి.

భారతదేశంలో సమర్థులైన దర్శకులు, ఫోటోగ్రాఫర్లు, ఆర్ట్‌డైరెక్టర్లు, సంగీత దర్శకులు లేరనికాదు. అయినప్పటికీ భారతీయ సినిమాలు ఇంత అధ్వాన్నంగా తయారుకావటానికి కారణాలేమిటి ?

1951 దాకా ప్రపంచంలోని అనేక దేశాల్లోని సినిమాల్లో వస్తున్న మార్పులను గురించిగానీ ఆయాదేశాల్లోని దర్శకులు సినిమాల్లో చేస్తున్న అనేక ప్రయోగాలను గూర్చిగానీ భారతీయ దర్శకులకు తెలీదు. మనదేశంలోకి అమెరికాలోని హాలీవుడ్‌లో నిర్మించిన చిత్రాలే ఎక్కువగా వస్తుండేవి. అందువల్ల మనదేశపు చాలా మంది దర్శకులకు హాలీవుడ్ చిత్రాలే ప్రధానమైన స్ఫూర్తినిచ్చేవి. హాలీవుడ్ చిత్రాల్లో ప్రేక్షకుల్ని ఏవిధంగా ఆకర్షించి డబ్బు చేసుకోవాలన్న అంశానికే ఎక్కువ ప్రాధాన్యం కనుక హాలీవుడ్ కాకుండా వేరే ప్రాంతాల్లో-ముఖ్యంగా ఫ్రాన్స్, ఇటలీ రష్యా, మొదలైన దేశాల్లో రెనోయర్, డిసేకా, ఐజెన్‌స్టీన్ లాంటి మహాదర్శకుల సినిమాలను చూసే అవకాశం మనదేశపు దర్శకులకు కలగలేదు.

భారతదేశానికి 1947 లో స్వాతంత్ర్యం రావటంతో ఈ పరిస్థితి కొంత వరకు మారింది. భారత ప్రభుత్వం సినిమానొక ముఖ్యమైన సాంస్కృతిక మాధ్యమంగా గుర్తించింది. మన దేశంలో కూడా మంచి చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించటానికి తీసుకోవలసిన చర్యలేమిటో సూచించమని 1951 'ఫిల్మ్ ఎంక్వైరీ కమిటీని నియమించింది. ఈ కమిటీ చేసిన సిఫారసుల్లో ఫిల్మ్‌ఇన్‌స్టిట్యూట్‌ను స్థాపించటం, ఫిల్మ్ ఆర్కైవ్స్‌ను నిర్మించటం, ఫిల్మ్ ఫైనాన్స్ కార్పొరేషన్‌ను ఏర్పాటు చెయ్యటం, ఫిల్మ్‌సొసైటీలను ప్రోత్సహించటం, అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలను భారతదేశంలో నిర్వహించటం మొదలైనవి చాలా ముఖ్యమైనవి. భారత ప్రభుత్వం ఈ కమిటీ సిఫారసుల మేరకే పూనాలో ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌ను, ఫిల్మ్ ఆర్కైవ్స్‌ను స్థాపించింది. కళాత్మక చిత్రాలను నిర్మించటానికి కావలసిన ద్రవ్యాన్ని ఋణాల రూపంలో అందజేయటానికి బొంబాయిలో ఫిల్మ్‌ఫైనాన్స్ కార్పోరేషన్‌ను స్థాపించారు. వీటన్నిటికంటె ముఖ్యంగా 1951 లో ఢిల్లీలో అంతర్జాతీయ చలన చిత్రోత్సవాన్ని నిర్వహించటం మనదేశపు చలన చిత్ర దర్శకుల్ని ఎక్కువగా ప్రభావితం చేసింది. ఈ చలన చిత్రోత్సవంలో భారత దేశంలో మొదటి సారిగా 'బైసైకిల్ థీవ్స్' 'మార్శైన్' 'రోషమన్' లాంటి గొప్ప కళాఖండాల్ని

ప్రదర్శించారు. పుడోవికిన్, జాన్ హస్టన్, రెనోయిర్ లాంటి సినిమా దర్శకులు మన దేశాన్ని సందర్శించారు. ఈ విధంగా ప్రపంచ సినిమాలో వస్తున్న అనేక మార్పుల్ని, అనేక ఉద్యమాల్ని మనదేశపు దర్శకులు అర్థం చేసుకోవటానికి ఈ అంతర్జాతీయ చలన చిత్రోత్సవం ఎంతగానో దోహదం చేసింది. ఈ చిత్రోత్సవంలో ప్రదర్శించిన చిత్రాల్లోకెల్లా ఇటలీ దేశానికి చెందిన 'బైసైకిల్‌థీవ్స్' అన్న చిత్రం మనదేశపు చాలా మంది యువదర్శకుల్ని ప్రభావితం చేసింది.

విట్టోరియా డిసేకా నిర్మించిన "బైసైకిల్ థీవ్స్" చిత్రం "నవ్యవాస్తవికత" (Neo Realism) అన్న ఒక కొత్త సినిమా ఉద్యమాన్ని ఆవిష్కరించింది. ఇంతకు ముందు ఫ్రాన్స్ దేశానికి చెందిన రెనోయిర్ (Jeen Renoir) అన్న దర్శకుడు నిర్మించిన 'రూల్స్ ఆఫ్ ది గేమ్' చిత్రం ఈ నవ్యవాస్తవికతను ప్రారంభించింది.

సినిమాలు వాస్తవ జీవితాన్ని ప్రతిబింబించాలన్నది నవ్య వాస్తవికత యొక్క ముఖ్య సిద్ధాంతం. సినిమాలు వాస్తవ జీవితాన్ని చిత్రించాలంటే సినిమాల్లో భారీ సెట్టింగులుగానీ, భారీ సన్నివేశాలుగానీ, పేరు ప్రఖ్యాతులున్న నటీనటులనుగానీ, పెద్ద పెద్ద డైలాగులుగానీ, పెద్ద పెద్ద శబ్దాలతో కూడిన సంగీతంగానీ, కెమేరాచేసే సర్కస్‌ఫీట్లుగానీ ఉండకూడదని నవ్యవాస్తవికతావాదులు నమ్మారు. డిసేకా నిర్మించిన "బైసైకిల్ థీవ్స్" సినిమాలో ఇవేవీ కనిపించవు. స్టూడియోల్లో తీస్తే అసహజంగా ఉంటాయని భావించిన డిసేకా తన మొత్తం సినిమాను ఔట్‌డోర్స్‌లోనే షూట్ చేశాడు. ఒక రోడ్డుమీద జరిగే దృశ్యాన్ని రోడ్డు మీదనే, వర్షంలో తీయాల్సిన దృశ్యాన్ని నిజమైన వర్షంలోనే షూట్ చేశాడు ఇదివరకు ఎలాంటి నటనానుభవంలేని నటీనటులనే తన సినిమాలో తీసుకున్నాడు - చాలా సినిమాల్లో నటించి ప్రజలచేత పిచ్చిగా ఆరాధించబడ్తున్న స్టార్స్‌ని తీసుకుంటే ప్రేక్షకులకు ఆస్టార్సేకనిపిస్తారుగానీ వాళ్ళు పోషిస్తున్న పాత్రలు, కనిపించవు. ఈ విధంగా డిసేకా నిర్మించిన 'బైసైకిల్‌థీవ్స్' ఢిల్లీ చిత్రోత్సవంలో ప్రదర్శించబడినప్పుడు అనేక మంది సినిమా దర్శకుల ఊహలకు పదునుపెట్టింది - స్వాతంత్ర్యం తర్వాత భారతదేశ చలన చిత్ర రంగంలో సంభవించిన ఆరోగ్యకరమైన మార్పులన్నిటి ఫలితమే సత్యజిత్‌రే అన్న మహాదర్శకుడి ఆవిర్భావం.

సత్యజిత్‌రే 1921 లో కలకత్తాలో ఎందరో గొప్ప కళాకారులకు నిలయమైన ఒక ఉన్నత కుటుంబంలో జన్మించాడు. చిన్నప్పట్నించే లలిత కళలమీద అభిమానాన్ని పెంచుకున్నాడు. కాలేజీవిద్య పూర్తయ్యాక శాంతినికేతన్‌లో నందలాల్‌బోస్ శిష్యుడిగా చిత్రలేఖనాన్ని అభ్యసించాడు. అక్కడే భారతదేశపు ప్రాచీన కళల్ని, పాశ్చాత్యదేశాల సంగీతాన్ని, కళల్ని అధ్యయనం చేశాడు, 1947 లో కలకత్తాలో

భారతదేశపు మొట్టమొదటి ఫిల్మ్ సొసైటీని స్థాపించాడు. ఈ ఫిల్మ్‌సొసైటి కారణం గానే "బాటిల్‌షిప్ పోటెమ్‌కిన్" "సిటిజెన్‌కేన్" లాంటి గొప్ప చిత్రాల్ని చూశాడు. ఫ్రాంక్‌కాప్రా, జాన్‌ఫోర్డ్, ఐజెన్‌స్టీన్, రెనాయిర్ లాంటి దర్శకులంటే విపరీతమైన అభిమానాన్ని ఏర్పరచుకున్నాడు. ఓ ప్రైవేట్ కంపెనీలో లేఅవుట్ ఆర్టిస్టుగా ఉద్యోగంలో చేరాడు. 1950 లో ఆ కంపెనీవాళ్ళు రేను కమర్షియల్ ఆర్టులో ట్రైనింగు కోసం లండన్ పంపిస్తే అక్కడున్న ఐదునెలల్లో ఎన్నో దేశాలకు చెందిన 99 గొప్ప సినిమాల్ని చూచాడు. లండన్ నుండి తిరిగివస్తూ తన ప్రయాణం చేస్తున్న నౌకలో కూర్చొని ఎంతో కాలంగా సినిమాగా మలచాలని కలలుగంటున్న తన అభిమాన నవల 'పథేర్ పాంచాలి'కి సినిమా స్క్రిప్టు తయారు చేసుకున్నాడు. కలకత్తా వచ్చాక తన అభిమానదర్శకుడు రెనాయిర్‌ను కలుసుకునే అవకాశంకల్గింది. అతడు నిర్మిస్తున్న 'రివర్' అనే సినిమా షూటింగ్‌కోసం రెనాయిర్ కలకత్తా వచ్చాడు. రెనాయిర్ నుండిసినిమాకళకుసంబంధించినఅనేకసూక్ష్మాలనుతెలుసుకున్నాడు.జీవితాన్ని ఇదివరకే ఏర్పరచుకున్న అభిప్రాయాలతో కాకుండాఅప్పుడే కళ్ళు తెరచిన ఓపసివాడిలా చూడటం నేర్చుకోవాలన్న ఒక ప్రాథమిక సూత్రాన్ని సత్యజిత్‌రే రెనాయిర్‌నుండే గ్రహించాడు. ఈ విధంగా రే తననుతాను ఒక సమర్థవంతుడైన సినిమా దర్శకుడుగా మలచుకున్నాడు. కళాకారుడుగా తనను తాను తెలుసుకున్నాడు. 1951 లో 'పథేర్ పాంచాలి' చిత్ర నిర్మాణాన్ని ప్రారంభించాడు.

విభూతి భూషణ్ బెనర్జీ రచించిన "పథేర్ పాంచాలి" నవల స్వాతంత్ర్యానికి ముందు 1920 లలోని గ్రామీణ బెంగాల్ వాతావరణాన్ని చిత్రిస్తుంది. (పథేర్ పాంచాలి' అంటే ఒక రోడ్డుపాడే పాట అని అర్థం, Song of the Road) ఈ నవలలో ఎక్కడా అసహజమైన పాత్రలుగానీ, అవాస్తవికమైన సన్నివేశాలుగానీ లేవు. ప్రపంచంలోని లక్షలాది మంది జీవితాల్లాగా చాలా సాఫీగా, సరళంగా సాగుతుంది - జననం, మరణం, దుఃఖం, సంతోషం. బాధ, కలలు, కన్నీళ్ళు, ఆశ, నిరాశ, దారిద్ర్యం, ప్రకృతి బీభత్సం మొదలైన సాధారణ జీవితంలో ఉండే సాధారణ అంశాలే ఈ నవలలో ఉన్నాయి. ఎన్ని ఎదురు దెబ్బలు తగిలినా, ఎంత దుఃఖం ఎదురైనా మానవుడిలోని జీవితాన్ని ముందుకు తీసుకెళ్ళాలనే తత్వం మాత్రం మారదు - జీవితాన్ని జీవించాలనే మానవ నైజంతో మార్పుండదు. ఇదీ 'పథేర్‌పాంచాలి' ఇచ్చే సందేశం. నవ్యవాస్తవికతతో ప్రభావితుడైన సత్యజిత్‌రేకు ఈ నవలను సినిమాగా మలచాలన్న కోరిక కల్గటంలో ఆశ్చర్యంలేదు.

తనలాగే ఇదివరకు ఎలాంటి సినిమా అనుభవంలేని ఔత్సాహికులైనకొందరు కళాకారులతో రే ఒక సినిమా యూనిట్‌ను ఏర్పరచుకున్నాడు. ఈ యూనిట్‌లోని ముఖ్యులు సుబ్రతోమిత్ర అనే ఫోటోగ్రాఫర్, బన్సీ చంద్రగుప్త అనే ఆర్ట్‌డైరెక్టర్ నటీనటులందరూ కొత్త వాళ్ళే - మొత్తం సినిమాను అవుట్‌డోర్స్‌లోనే కథలో

ఎలాంటి వాతావరణం ఉందో అలాంటి సహజ వాతావరణంలో షూట్ చెయ్యాలని నిర్ణయించారు. తన ఇన్సూరెన్స్ పాలసీలను కుదువపెట్టి పదిహేడు వేలరూపాయల అప్పు సంపాదించి రే 'పథేర్ పాంచాలి' చిత్రాన్ని 1951 లో ప్రారంభించాడు. ఐదారు రీళ్ళు పూర్తికాగానే డబ్బయిపోయింది. సినిమా నిర్మాణం ఆగిపోయింది. కొన్ని రోజుల తర్వాత అప్పటి పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి బి.సి.రాయ్ పూర్తయిన ఆ నాల్గయిదు రీళ్ళను చూడటం జరిగింది. ఇదేదో అప్పుడే భారతదేశపు పల్లెటూర్లను అభివృద్ధి చెయ్యటానికి ప్రభుత్వం పెద్ద యెత్తున్న ప్రారంభించిన కమ్యూనిటి డెవలప్‌మెంట్ ప్రోగ్రామును ప్రచారం చేసే సినిమాలా ఉందని భావించిన బి.సి.రాయ్ ఈ సినిమాకు వెంటనే ప్రభుత్వం తరఫున ఆర్థిక సహాయాన్ని ప్రకటించాడు. ఆ విధంగా పూర్తయి, పశ్చిమబెంగాల్ ప్రభుత్వం నిర్మించిన చిత్రంగా 1955 లో 'పథేర్‌పాంచాలి' చిత్రం కేన్స్‌లో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో ప్రదర్శించబడింది. దాంతో భారతదేశ చలన చిత్ర చరిత్రలో ఒక నూతనశకం ప్రారంభమైంది.

మేధావులేకాదు పశ్చిమ బెంగాల్‌లో ఈ చిత్రం విడుదలయినప్పుడు సామాన్య ప్రజానీకం కూడా ఈ సినిమాను ఆదరించారు. ఈ చిత్ర నిర్మాణానికి పశ్చిమబెంగాల్ ప్రభుత్వం పెట్టిన పెట్టుబడికంటె ఇరవై ఐదురెట్లు అధికంగా ఈ చిత్రం సంపాదించగల్గింది. అప్పట్నుంచి ఇప్పటి వరకు ఈ చిత్రం గెల్చుకున్నన్ని అవార్డుల్ని మరే ఇతర భారతీయ చిత్రం కూడా గెల్చుకోలేదు. ఇంత సంచలనాన్ని సృష్టించిన ఈ చిత్రంలో వున్న ప్రత్యేకత ఏమిటి?

ప్రఖ్యాత సినిమా విమర్శకుడు ప్రొఫెసర్ సతీష్ బహదూర్ 'పథేర్‌పాంచాలి' చిత్రం యొక్క ఔన్నత్యాన్ని ఇలా చెప్పాడు.

"Pather Panchali is a film completely different from any other Indian films in concept, intensity of feeling and in the use of film medium It was totally a film art: it used the language of cinema without taking rewarse to any of the theatrical conventions of the studio made Indian film. And precisely because Ray had used the genuine methods of cinema, the images of India, men, women and children in recognisable Physical and cultural miliew, were absalutely genuine. The effect of the film on a discriminating Indian andience was aeectrifying. Here was a film which reflected the Indian reality Is no other Indian film had done before. The story of the joys

and trials of a Bengali village family in the 1920's appeared to many sensitive viewers in different regions of the country as truely Indian, in spite of the fact that it was intensely Bengali. Because it was truely Indian pather panchali made the same impact of truthfulnes on the international audienc. Like all great woes of art, pather panchali was at the same time, genuinely regional, genuinely national and genuinely universal*"

'పథేర్ పాంచాలి' చిత్రంలో విభూతిభూషణ్ బెనర్జీ రచించిన నవల పూర్తిగా చెప్పబడలేదు. అందువల్ల రే అదే నవలలోని తర్వాతి భాగాన్ని 'అపరాజితో' అన్న తన రెండవచిత్రంగా నిర్మించాడు. 'పథేర్ పాంచాలి'తో రే ప్రారంభించిన నవ్యవాస్తవికత 'అపరాజితో'లో కూడా కొనసాగింది. 'పథేర్ పాంచాలి'కి లభించి నన్ని ప్రశంసలు ఈ చిత్రానికి లభించకపోయినప్పటికి ఈ చిత్రంలో కూడా రే ప్రతిభా వ్యుత్పత్తులు ప్రతిఫ్రేములోను కనిపించాయి. అయితే 'అపరాజితో'తో కూడా విభూతిభూషణ్ బెనర్జీ నవల పూర్తికాలేదు. ఆ నవల చివరిభాగాన్ని రే 'అపూర్ సంసార్' అన్న చిత్రంగా నిర్మించి 'పథేర్ పాంచాలి' నవలను పూర్తిగా తెరకెక్కించాడు. ఈ మూడు చిత్రాలే తర్వాత 'అపూత్రయం'గా (Aputrilogy) పేరొ్కనబడ్డాయి.

ఈ మూడు చిత్రాల్లోనూ నాయకుడు అపూ (పూర్తిపేరు అపూర్బాకుమార్ రే) "పథేర్ పాంచాలి" అపూ బాల్యాన్ని చిత్రిస్తుంది. ఈ చిత్రంలో జరుగుతున్న సంఘటనలన్నింటికీ అపూ ఒక ప్రేక్షకుడు మాత్రమే. ఈ చిత్రాన్ని మనకు అపూ కళ్ళతో చూపిస్తాడు రే. ఈ చిత్రమంతా అపూ తల్లిచాటున వుండి ప్రతి సన్ని వేశాన్ని జాగ్రత్తగా గమనిస్తున్న పసివాడిలా కనిపిస్తాడు. 'అపరాజితో' చిత్రంలో అపూ బాల్యాన్ని వీడి కౌమారదశలో ప్రవేశిస్తాడు. హైస్కూలు చదువు పూర్తిచేసి కాలేజీలో ప్రవేశిస్తాడు - తనదైన స్వతంత్ర వ్యక్తిత్వం అతనిలో ఏర్పడుతుంది. అతని మానసిక పరిధులు విస్తరించటంతో తల్లి పరిధిలోంచి బయట పడాలని ప్రయత్నిస్తాడు. "అపూర్ సంసార్"లో అపూ ఒక సంపూర్ణమైన మానవుడుగా రూపొందుతాడు. భార్యను ప్రేమించిన భర్తగా, ఆమెను పోగొట్టుకున్న భగ్నహృదయుడుగా, సర్వసంగపరిత్యాగిగా జీవితం యొక్క అనేక రూపాల్ని అనుభవిస్తాడు.

ఈ మూడు చిత్రాలను ఒకేసారి చూడటం ఒక అద్భుతమైన ఆనందాన్ని కలిగిస్తుంది.

---

*"In the context of Indian Film" అన్న ప్రొ॥ సతీష్‌బహదూర్ రాసిన వ్యాసంలోంచి.

'అపూత్రయం'లో కథకంటె ఎక్కువ యదార్థ జీవిత చిత్రణ ఉంటుంది. మారుతున్న మానవ సంబంధాల చిత్రణ వుంటుంది. జీవితంలోని అత్యంత సహజమైన అనేక అనుభూతుల చిత్రణ ఉంటుంది. ఆనాటి భారతదేశపు పల్లెల్లో ఎంతటి దుర్భరమైన దారిద్ర్యం ఉండేదో ఈ చిత్రాలు చూపిస్తాయి. అయినా ఆనాటి ప్రజలు ఎంత ఓపిగ్గా ఆ దారిద్ర్యాన్ని భరించేవాళ్ళో, భవిష్యత్తులోనైనా పరిస్థితులు మారతాయని ఎన్ని కలలుగనేవాళ్ళో ఈ చిత్రాలు చెబుతాయి.

క్లుప్తంగా ఈ మూడు చిత్రాల్లోని కథ: స్వాతంత్ర్యానికి ముందు - అంటే పంతొమ్మిది వందల ఇరవైలలో బెంగాల్‌లోని పల్లెటూర్లో నివసిస్తున్న ఓ పేద బ్రాహ్మణ కుటుంబానికి సంబంధించిన కథ 'పథేర్ పాంచాలి'లో చెప్పబడింది.

ఆ బ్రాహ్మణుడి పేరు హరిహరరాయ్. అతని భార్య పేరు సర్వోజయ. వాళ్ళకు దుర్గ అనే కూతురుంటుంది. ఇందిర్ అనే డెంభై ఏళ్ళ వృద్ధురాలు-హరిహరరాయ్‌కు బంధువు-వాళ్ళింట్లోనే ఉంటుంది. తాతలనాటి వాళ్ళ పాతఇంట్లో వీళ్ళు నలుగురూ నివసిస్తూ ఉంటారు. కొద్ది రోజుల తర్వాత హరిహరరాయ్ దంపతులకు ఓ కొడుకు పుడతాడు. అతని పేరే అపూ.

హరిహరరాయ్ నాటకాలు, నవలలు, కవిత్వం రాస్తుంటాడు. కానీ అతని రచనల ద్వారా అతనికేమీ ఆదాయం లభించదు. బాగా డబ్బున్న ఓ జమీందారు దగ్గర లెక్కలు రాసి కొద్దిగా సంపాదిస్తాడు. కాని ఆ సంపాదన ఏ మూలకూ సరిపోదు. ఆ కుటుంబం ఎప్పుడూ దుర్భరమైన దారిద్ర్యాన్ని అనుభవిస్తూ ఉంటుంది.

సర్వోజయ చాలా తెలివైన స్త్రీయే. సమాజంలో గౌరవంగా బ్రతకాలనుకుంటుంది. తమను ఎవరూ వేలెత్తి చూపకూడదనుకుంటుంది. కూతురు దుర్గ తమ పక్కవారి తోటల్లోంచి పళ్ళను దొంగిలించటం ఆమె కిష్టముండదు. అలాగే ఇందిర్ అనే వృద్ధురాలు వాళ్ళింట్లో వుండటం కూడా ఆమె కిష్టముండదు. తమకే గడవటం లేదు. ఈ ముసలిదాన్ని ఎలా పోషించాలి అనుకుంటుంది. అపూ పుట్టాక అపూ మీదనే ఆమె ఆశలన్నీను. వెయ్యి కళ్ళతో అపూను కాపాడుకుంటుంది.

హరిహరరాయ్ దేశదిమ్మరి. ఇంట్లో చాలా తక్కువగా ఉంటాడు. పది రోజుల్లో వస్తానని వెళ్ళి మూడు నెలలదాకా ఇంటికి రాడు.

దుర్గ, అపూలు కలిసి ఊరంతా తిరుగుతుంటారు. బొంబాయి సినిమా చూపించేవాడిని, స్వీట్లు అమ్ముకోవటాని కొచ్చేవాడిని విచిత్రంగా చూస్తూ ఉంటారు. వాళ్ళ ఊరికి కొంచెం దూరంనుండి వెళ్ళే ట్రెయిన్ను చూడటానికి వెళ్తారు. అపూ మొదటిసారి ట్రెయిన్‌ను చూసినప్పుడు చాలా అద్భుతంగా ఫీలవుతాడు. ఆ ఊర్లో జరిగే దుర్గ స్నేహితురాలి పెళ్ళికి వెళ్తారు. వాళ్ళు చాలా ధనవంతులు. అపూ బ్యాండ్ మేళాన్ని, వాళ్ళు వాయిస్తున్న తీరును వింతగా చూస్తాడు. రాత్రుళ్ళు ఆ

ఊర్లో ప్రదర్శింపబడుతున్న వీధి నాటకాన్ని చూస్తారు. అపూ రాజులాగే తలమీద ఓ కిరీటాన్ని తగిలించుకొని తిరుగుతాడు. వృద్ధురాలు ఇందిర్ చనిపోతుంది.

వర్షాకాలం వస్తుంది. దుర్గ, అపూలు వర్షంలో తడుస్తారు. దుర్గకు న్యూమోనియా సోకుతుంది. కూలిపోవటానికి సిద్ధంగా వున్న వాళ్ళ ఇల్లు తుఫాను తాకిడికి చెల్లాచెదరై పోతుంది. న్యూమోనియాతో దుర్గ చనిపోతుంది.

ఇదంతా జరిగాక హరిహరరాయ్ దేశాటనం ముగించుకొని ఇంటికొస్తాడు. దుర్గ చనిపోయిందని తెలుసుకుంటాడు. ఇక ఆ ఊర్లో ఉండకూడదని, బెనారస్ వెళ్ళిపోవాలని నిర్ణయించుకుంటాడు. హరిహరరాయ్, సర్బోజయ, అపూలు తమ తాతతండ్రుల నాటి ఆ ఇంటిని విడిచిపెట్టి వెళ్ళిపోతుండగా 'పథేర్ పాంచాలి' చిత్రం అయిపోతుంది. వీళ్ళు ముగ్గురూ ట్రెయిన్లో గంగానదిని దాటుతూ బెనారస్ చేరుకుంటుండగా 'అపరాజితో' చిత్రం ప్రారంభమౌతుంది.

బెనారస్‌లో గంగానది పక్కనే ఉంటూ బెనారస్‌కు వచ్చి పోయే యాత్రికులకు పురోహితుడుగా పనిచేస్తూ జీవనం సాగిస్తుంటాడు హరిహరరాయ్. కానీ బెనారస్ కొచ్చిన కొద్ది రోజుల్లోనే హరిహరరాయ్ చనిపోతాడు. సర్బోజయ తన బంధువులున్న ఓ పల్లెటూరు చేరుకొని అపూను ఆ ఊరి స్కూల్లో చేర్పిస్తుంది. అపూ పెద్దవాడు అవుతుంటాడు. అపూలోని తెలివితేటల్ని గుర్తించిన ఆ స్కూలు హెడ్‌మాస్టర్ అపూను హైస్కూలు చదువు ముగిశాక కలకత్తాకు వెళ్ళి కాలేజిలో జాయిన్ కమ్మంటాడు. అందుకు తగిన సహాయాన్ని కూడా ఆ హెడ్‌మాస్టర్ చేస్తాడు. కొడుకును కలకత్తాకు పంపించటం సర్బోజయకు ఇష్టం ఉండదు. తనకున్న ఏకైక ఆధారం అపూ తనకు దూరమై పోతాడని భయపడ్తుంది. కాని తను అతన్ని అపలేనని తెలుసుకుంటుంది. అపూ కలకత్తాకు వెళ్ళి రాత్రి ఓ ప్రెస్‌లో పనిచేస్తూ అలా సంపాదించిన డబ్బుతో కాలేజిలో చేరి చదువుకుంటూ ఉంటాడు. క్రమంగా అతని ప్రపంచం విశాలమైపోతుంది. ఇంకా దూరం వెళ్ళాలని ఉవ్విళ్ళూరుతుంటాడు. సర్బోజయ ఆరోగ్యం చెడిపోతుంది. కలకత్తాలో ఉన్న కొడుకు కోసం అనుక్షణం ఎదురుచూస్తూ ఉంటుంది. చివరకు కొడుకు పక్కన లేకుండానే ఆమె ఈ ప్రపంచాన్ని శాశ్వతంగా వదిలిపెట్టి వెళ్ళిపోతుంది—ఇది అపూత్రయం లోని 'అపరాజితో' కథ.

అపూ కాలేజిలో చేరి ఇంటర్మీడియట్ పూర్తిచేసి అంతటితో చదువుకోవటం ఆపెయ్యాలని నిర్ణయించుకొని వాస్తవ ప్రపంచంలో ప్రవేశించటంతో 'అపూర్ సంసార్' ప్రారంభమౌతుంది. అపూ తనో రచయిత కావాలని, నవలలు, కథలు, కవిత్వం రాయాలని కలలు గంటూ, మిత్రులతో కవిత్వాన్ని గూర్చి చర్చిస్తూ గడుపుతుంటాడు. చాలా విచిత్రమైన పరిస్థితుల్లో అపూ అపర్ణ అనే తన స్నేహితుడి

చెల్లెల్ని పెళ్ళి చేసుకోవలసి వస్తుంది. అపూ తన స్నేహితుడి చెల్లెలు పెళ్ళికి వెళ్తాడు. కానీ ఆపెళ్ళి ఆగిపోతుంది. కారణం పెళ్ళికొడుకు పిచ్చివాడని పెళ్ళికూతురు తరఫువాళ్ళకు పెళ్ళికి కొన్ని గంటలు ముందుగా మాత్రమే తెలియటం. ఆడపిల్ల పెళ్ళి ఆగిపోవటాన్ని ఆ రోజుల్లో చాలా ఉపద్రవంగా భావించేవాళ్ళు. అందువల్ల అపూ స్నేహితుడు అదే ముహూర్తానికి అపూను తన చెల్లెల్ని పెళ్ళి చేసుకోమని బతిమాలుతాడు. స్నేహితుణ్ణి ఆదుకోవటం కోసం అపూ అతని చెల్లెలు అపర్ణను పెళ్ళి చేసుకుంటాడు.

అపూ అపర్ణతో కాపురం చెయ్యటం మొదలెడతాడు. అపర్ణ చాలా త్వరగానే అపూను పూర్తిగా తనవాడ్ని చేసుకుంటుంది. అపర్ణను అపూ తన సర్వస్వంగా భావిస్తాడు. పేదవాళ్ళే అయినప్పటికి పరస్పరం ప్రేమించుకోవటం వల్ల వాళ్ళ కాపురం హాయిగా సాగుతుంది. కానీ పురుడు పోసుకోవటానికని పుట్టింటికి వెళ్ళిన అపర్ణ మళ్ళీ రాదు. కొడుకును కని చనిపోతుంది. ఈ వార్త విన్న అపూ పిచ్చివాడై పోతాడు. తననుండి అపర్ణను దూరంచేసింది తన కొడుకేనని అపూ కొడుకును క్షమించలేకపోతాడు. సర్వసంగ పరిత్యాగిగా మారిపోయి దేశం మీద పడి తిరుగుతుంటాడు. జీవితం మీద కసిని, వైరాగ్యాన్ని పెంచుకొని తను రాసిన ఓ నవల మొత్తాన్ని గాలిలోకి విసిరేస్తాడు. చివరకు అనాథగా తిరుగుతున్న తన కొడుకును చూసి కొడుకును పెంచాల్సిన బాధ్యత తనదేనని గుర్తించి జీవితంతో రాజీపడి కొడుకును తీసుకొని కలకత్తాకు వెళ్ళిపోతాడు—ఇదీ "అపూర్ సంసార్" కథ.

ఈ అపూ ట్రిలోజీలో సినిమా చూడటం తెలిసిన ప్రతి ప్రేక్షకుడి హృదయాన్ని హత్తుకునే దృశ్యాలెన్నో ఉన్నాయి. అందులో ఎప్పుడూ గుర్తుండిపోయే కొన్ని దృశ్యాలు: ట్రెయిన్‌ను చూడటానికి దుర్గ, అపూలు రైలుపట్టాల దగ్గరకు వెళ్ళి బ్రహ్మాండంగా రైలుపట్టాల మీంచి వెళ్ళిపోతున్న ట్రెయిన్‌ను చూసిన దృశ్యం; వర్షాకాలం ప్రారంభం కావటంతో మొదట కొద్ది చినుకులతో ప్రారంభమై తర్వాత కుండపోతగా కురిసిన వర్షం, ఆ వర్షంలో తడుస్తూ ఒక అద్భుత తన్మయత్వం లోకి వెళ్ళిపోయిన దుర్గను చెట్టుకింద కూర్చొని వణికిపోతూ అపూ ఆశ్చర్యంగా చూసే దృశ్యం, ఒకవైపు న్యుమోనియా జ్వరంతో కొట్టుమిట్టాడుతున్న కూతురు, మరోవైపు తుఫాను తాకిడికి కుప్పకూలిపోతున్న తన ఇల్లు-ఈ రెంటికి మధ్య నిస్సహాయంగా చిక్కిపోయి దుర్భరమైన వేదనకు గురయ్యే ఆ మాతృమూర్తి; దేశాటనాన్ని పూర్తి చేసుకొని తిరిగొచ్చిన హరిహరరాయ్ కూతురు దుర్గ కోసం ఈ చీర తెచ్చానని చూపించినప్పుడు కట్టలు తెంచుకున్న దుఃఖంతో ఆ తల్లి కుప్పకూలిపోవటం, హరిహరరాయ్ చివరి శ్వాస విడిచినప్పుడు పావురాలు ఎగిరిపోయినట్టుగా అతడు అనంత వాయువుల్లో కలిసిపోవటం, తన వ్యథలన్నీ చెప్పుకుంటోంటే పూర్తిగా వినకుండానే నిద్రలోకి జారిపోయిన తన అపూను చూసి

కొడుకు తననుండి దూరంగా వెళ్ళిపోతున్నాడన్న చేదునిజాన్ని గ్రహించిన తల్లిలో చెలరేగిన ఆందోళన, అపూ అపర్ణల మొదటి రాత్రి, అపర్ణ చనిపోయిందని అతని బావమరది చెప్పినప్పుడు అపూ ప్రతిస్పందించిన విధానం—ఈ దృశ్యాలన్నీ మానవ హృదయం పొందే వివిధ గతుల్ని, వివిధ అనుభూతుల్ని సినిమా భాషలోకి అనువాదం చేసిన సత్యజిత్ రే ఎంతటి మహా కళాకారుడో నిరూపిస్తాయి.

ఈ మూడు చిత్రాల్లోను పాటలు, సంగీతం, ఫోటోగ్రఫీ, సెట్టింగులు, నటన, సంభాషణలు వేటికవే అన్నట్టుగా కాకుండా అన్నీ ఒక సంపూర్ణమైన కళలో సంపూర్ణంగా సమ్మేళనం చెందుతాయి. ఈ సినిమాలు చూశాక ఈ సినిమాలు బావున్నాయని చెబుతామే తప్ప డైలాగులు బావున్నాయనో, పాటలు బావున్నా నోయ, సెట్టింగులు బావున్నాయనో, ఫోటోగ్రఫీ బావుందనో, సంగీతంబా వుందనో→

---

(65వ పేజీ తరువాయి)

అడవి బిడ్డల బాధల బతుకుల్లో
కలమెత్తి గళమెత్తి కాలు కలిపిండో ॥మా యన్న॥
ప్రజలే తన బంధువులన్నాడు
సహచరులే తన ప్రాణమన్నాడు ॥స॥
ఉద్యమమే తన ఊపిరిగా
విప్లవమే తన ధ్యేయమన్నాడు ॥వి॥
చుక్క చుక్క తన వేడి నెత్తురును
ప్రజల కోసమే ధారపోసినాడన్న ॥మా యన్న॥
పెరుగుతున్న పోరు జ్వాలల్ని ఆర్ప
పోలీసు వరదల్ని ముంచెత్తినారు ॥పో॥
నిద్రించెనిను బట్టి హింస లెన్నోపెట్టి
గుండెల్లో తూటాలు గుమ్మరించిండ్రు ॥గు॥
ఎదిరించి కొండలు ఎరుపెక్కంగ
గడిపూర్ అడవంత గగుర్పొడవంగ ॥మా యన్న॥
అన్న రక్తంతోని మల్లెలన్ని తడిసి
జాజిపూలై జంక్షన్‌లోన మెరిసె ॥అ॥
అన్న కార్చిన నెత్తుటీ చుక్కలు
తురాయిపూలై తూటలయ్యి పేలె ॥తు॥
అన్న తాకిన గరిక పూవులన్ని
దోపిడీ గుండెల్లో గన్నులై పేలే ॥మా యన్న॥

★ "కామ్రేడ్ నూతన్ (వేణన్న) కోసం" 30-6-92

→ చెప్పుకోము. వీటన్నిటిని సినిమాలోని అంతర్భాగాలుగా మార్చివెయ్యటంలో దర్శకుడు సఫలీకృతుడయ్యాడు. సినిమా అనేది పూర్తిగా దర్శకుడి మాధ్యమమని, దర్శకుడు ప్రతిభావంతుడయితే సినిమాలోని అన్ని అంశాలు బావుంటాయని సత్యజిత్ రే ఋజువు చేశాడు. ★

ఈ వ్యాసం రాయటానికి ఉపకరించిన పుస్తకాలు :

1. Portrait of a Director - Marie Seton.
2. Talking about Films - Chidanada Das Gupta
3. In the context of Indian Film Culture - Prof. Satish Bahadur
4. Apu Trilogy - English translation of original Bengali film scripts of Pather panchali, Aparajitho and Apur Samsar.

---

(3 వ పేజీ తరువాయి)

స్యలు, విభేదాలు వున్నా అవి కలిసి పనిచేస్తూ పోతూంటే, అర్థం చేసుకొని సర్దుకోవడానికి మార్గం సుగమ మవుతుంది. సాహిత్య సాంస్కృతిక సంస్థలు ఇలా కలిసి పని చేస్తూ పోతే మన బలం రెట్టింపవుతుంది. మన వాణీ పెద్దదవుతుంది. మన రంగమూ విస్తృతమౌతుంది. మన బాధ్యతలు పంచుకున్న వారమౌతాము. ఆలస్యంగానైనా కలుస్తున్నందుకు, కలిసి శక్తివంతంగా తయారౌతున్న సాహిత్య సాంస్కృతిక సంస్థలకు ఆహ్వానం పలుకుతూ విప్లవాభినందనలు తెలియజేస్తున్నాను.

ఐక్యతా సదస్సుకు హాజరవుతున్న ప్రముఖులకు, సాహిత్యకారులకు, సాంస్కృతిక దళాలకు, కార్యకర్తలకు విప్లవాభినందనలు.

మీ

ఎ. ఎన్.

15-50, పద్మావతి నగర్,
తిరుపతి-517502.

టెలిఫోను నెం. 22040
తేదీ 26-6-92.

మిత్రులు నిర్మలానంద గారికి-

చాలా మంచి పరిణామాలు జరుగుతున్నాయి....

30న ఐక్యతా సదస్సు జరగడం మంచి మలుపు. అన్నింటా ఇట్లాంటివే జరగాలని నా అభిలాష....

మీ

భూమన్.

(భూమన్‌గారి లేఖ నుంచి)

# పిల్లల ప్రపంచం





## వేసవికి వీడ్కోలు...

మబ్బులు పట్టాయి. చల్లని గాలులు వీచాయి. పిల్లలందరూ పరుగు పరుగున మైదానాల్లోకి వచ్చారు. శరీరం మీద ఒక్కో వాన చినుకు పడుతుంటే 'అల్లా బిల్లి' తిరుగుతూ పాటలు పాడారు. అవును. వేసవి వెళ్తూ మనకి 'వాన'ని అందించింది.

అంతేకాదు 'బడి' మొదలయింది. మీరందరూ పాత తరగతుల నుండి కొత్త తరగతులకు వస్తున్నారు. కొత్త పుస్తకాలు, కొత్త బట్టలు, కొత్త టీచర్లు, ఇంకానేమో కొత్త కొత్త స్నేహితులు మిమ్మల్ని కలుస్తున్నారు. తిరిగి పాఠాలు చదవాలి, రాయాలి. ఇంక శెలవులకీ. నిన్నటి ఆనందాలకీ వీడ్కోలు పలకక తప్పదు. అయినా తిరిగి వేసవి వస్తుంది. మరిన్ని ఆనందాలు తెస్తుంది. అప్పటికి మీరు కొత్త విషయాలు నేర్చుకుంటారు. ఇంకా పెద్దవారవుతారు. మీ అందరికీ కొత్త విషయాలు నేర్చుకోవాలనీ, ఏదో సాధించాలనీ అనిపిస్తుంది. నిజమే. మీరందరూ రేపటి ప్రపంచానికి అధినేతలు. మేమంతా మీ ప్రపంచాన్ని తీర్చి దిద్దటానికే ప్రయత్నం చేస్తాం-

నెల నెలా ఓ రోజయినా మన 'పిల్లల ప్రపంచం'లోకి చూడండి. మీ కోసం ఇక్కడ ఓ 'నేస్తం' ఎదురు చూస్తుంటాడు....ఇంతకూ ఎవరా నేస్తం?

మీతో పాటు 'బడి'కి రానివాడు....

తన లేత చేతుల్తో 'శ్రమ' చేసే వాడు....అతనే మీ నేస్తం....అతనే పేద పిల్లవాడు.మీరు నేర్చుకున్నవన్నీ ఆ నేస్తానికిఅందించాలి. వినిపించాలి.

ఆ నేస్తాలకు బతుకంతా ఎండలే....

పిల్లలందరూ ఆనందంగా పాడుకోవాలి. ఆ రోజు వచ్చి తీరుతుంది.

— అంకుల్

నిర్వహణ : పి. చంద్రశేఖర్ అజాద్ APSTC Ltd., డి.సి.ఎమ్.ఎస్. బిల్డింగ్స్, ఎన్.ఆర్. పేట, ఏలూరు.

కథ :

## కుక్క-దొంగ

రాత్రి ఓ దొంగ పెరట్లోకి దూరాడు. కుక్క వాడి వాసన పట్టి మొరగటం మొదలు పెట్టింది.

దొంగ కొంచెం రొట్టె ముక్క తీసుకొని దాన్ని కుక్కకి విసిరాడు.

కుక్క దాన్ని అందుకోకుండా దొంగ మీదికి ఉరికి అతని కాలు కరిచింది.

"ఎందుకు కరుస్తున్నావ్? నీకు రొట్టె ముక్క ఇచ్చాగా" అన్నాడు దొంగ.

"ఎందుకో చెబుతా. రొట్టె ముక్క పెట్టక ముందు నువ్వు మంచి వాడివో చెడ్డవాడివో నాకు తెలియదు. కాని నువ్వు చెడ్డ వాడివని ఇప్పుడు నాకు తెలిసింది. ఎందుకంటే నాకు లంచం ఇవ్వామనుకున్నావు" అంది కుక్క.

—టాల్‌స్టాయ్ 'ఇదరు మిత్రులు'నుండి.

కవిత :

## బొమ్మను గీయను

'నేనిప్పుడు బొమ్మలు వేస్తున్నా'
'అలానా చూపించు. ఏం బొమ్మ
వేస్తున్నావు'
'నేనిప్పుడు పాటను గీస్తున్నా'
'పాటనా....చూపించు'
'ఇవిగో ఈ రేడియోల మధ్యలో
ఉన్నది పాటేగా!'

'తర్వాత ?'
'నేనిప్పుడు అమ్మ బొమ్మవేస్తున్నా'
'మంచిది. ఎక్కడ ఉంది అమ్మ'
'ఇదిగో సూర్యుడి మధ్యలో ఉంది'
ఇక్కడంతా చల్లగా ఉంది.
'తర్వాత?
'నేను నాన్నను గీస్తున్నా'
'ఎక్కడా కనిపించదే'
'మీకు పెద్ద పేపర్ కనిపించటంలేదా'
'కనిపిస్తోంది'
'దాని వెనక ఉన్నాడాయన'
'అలాగా - తర్వాత?'
'నేనిప్పుడు దుఃఖాన్ని చిత్రిస్తున్నా
'అయితే'
'అదిగో గుంపులు గుంపులుగా ని
బడి ఏడుస్తున్నారు
'తర్వాత'
'నేనిప్పుడు సంతోషాన్ని చిత్రిస్తున్నా
'మంచిది. చూపించు సంతోషాన్ని'
'ఇదిగో ఇక్కడ అంతా బలంగా
ఆరోగ్యంగా అందరూ రొట్టెతింటూ
పాడుకుంటున్నారు'
'బాగుంది..చాలాబాగుంది....ఇంకా'
'నేనిప్పుడు ఓ బొమ్మను గీయాలను
కోవటం లేదు'

'ఏమిటది?'
'కలన్ని గీయలేను?'
'ఎందుకని?'
'అవి నా కుంచెకు అందటంలేదు.
జారిపోతున్నాయి. ముక్కలవుతు
న్నాయి'
'సోవియట్ కవితకు స్వేచ్ఛానుసరణ'

'వాయిస్ ఆఫ్ చిన్ని'

## 'ప్రధానమంత్రి' కి ఉత్తరం

ప్రధాన మంత్రి తాతగార్కి

మా పిల్లలందరూ రాస్తున్న ఉత్తరం. తాతగారూ-మీరు క్షేమంగా ఉన్నారని మేం అనుకుంటున్నాం. మాకూడా బోలెడు సమస్యలు ఉన్నాయనే సంగతి మీకు తెలుసు కదా. మరెందుకని మీరు ఏమీ మాట్లాడటంలేదు. ఇక్కడ నేనూ మా బుల్లిగాడూ, గీతా, సంధ్యా, ఇంకా చాలా మంది పిల్లలూ కలిసి మాట్లాడుకున్నాక ఈ ఉత్తరం రాశాం. మీరు సొంతం చదివి మాకు రాస్తారని ఎదురు చూస్తుంటాం.

1. ఇంకా మా పిల్లల్ని వొంటెల మీద ఉంచి ఎడారుల్లో పోటీలు నడపటానికి తీసుకుపోతూనే ఉన్నారు. మేం ఏం కావాలి?

2. మా పిల్లలచేత పనులు చేయించుకోవటానికి మా చేతులూ, కాళ్ళూ విరగ్గొట్టి అడుక్కు తినేలా చేయటానికీ, ఇంకానేమో, మమ్మల్ని ఏ భాగాని కాభాగం అమ్ముకుంటానికి ముక్కలు ముక్కలుగా వస్తూనే ఉన్నారు.

3. బొంబాయిలోనూ, ఢిల్లీలోనూ, ఇలాంటి వారందరూ ఎక్కడెక్కడ ఉంటారో అందరికీ తెలుసునంట. మరి మీరు ఎందుకని వాళ్ళని అలా వదిలేసేరు ?

4. మా పిల్లల్లో కొందరు మొక్కల్ని పీకినా అది తప్పు అని చెబితే మానేస్తారు. మరి మీ పెద్దవాళ్ళు దేశంలో ఉన్న చెట్లు అన్నీ నరుక్కుంటూపోతే ఇంక ఏం మిగులుతాయి? మేం అందరూ బతికేసి వెళ్ళిపోతాం కదా' అనుకుంటే మా 'పిల్లల ప్రపంచం' రేపు ఏమై పోతుంది?

5. ఈసారి పరీక్షల్లో చాలా మంది తప్పారు. రాంకులు కూడా వచ్చాయి. అయితే కొద్ది మందికే ఎందుకిలా జరుగుతుంది? అందరూ రాంకులు తెచ్చుకునే రోజు రాదా?

6. 'భద్రం కొడుకో' సిన్మా చూద్దాం అనుకున్నాం. అది వెళ్ళి పోయిందట. కొన్ని చోట్లకు రాదంట. ఇలాంటి సినిమాలు మా పిల్లలంతా చూడాలంటే ఎలా? మీరేం చేస్తారు? 'సత్యజిత్ రే' గారు మా పిల్లల కోసం మంచి సిన్మాలు తీశారంట. అవన్నీ మాకు తెలుగు చేసి చూపించ వచ్చుకదా ? మీరూ తెలుగు వారేగా....ఎందుకు చూపించరు ?

7. 'సామంత' మీకు తెలుసుకదా.

ఆ అమ్మాయి మా పిల్లలందరి తరపునా "నాకు చాలా భయంగా ఉంది. ఈ భూ ప్రపంచానికి రేపే చివరి రోజు అనిపిస్తోంది." అని రష్యా వాళ్ళకు రాస్తే ఆ అమ్మాయిని అమెరికా నుండి పిలిపించి 'మేం యుద్ధాలుచేయం అని చెప్పా'రంట. ఇప్పుడు మీరు మా పిల్లలందరికీ ఏం చెబుతారు? అసలు ఈ ఉత్తరం అందనట్లుగానే ఉంటారా?

8. పిల్లలందరికీ చదువు చెప్పాలని మీరు అంటున్నారు. మరి ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా ఈ దేశంలోనే పిల్లలు ఎక్కువగా పని చేస్తున్నారంట. ఇలా ఎందుకు జరుగుతుంది?

ఇంకా చాలా చాలా ప్రశ్నలున్నాయి. మీకు రాస్తున్న కొద్దీ కొత్త కొత్త ప్రశ్నలు పుట్టుకొస్తూనే ఉన్నాయి అందుకే మీకు ఇప్పటికి ఈ ఎనిమిది ప్రశ్నలు మాత్రం పంపుతున్నాము.

తొందరగా ఉత్తరం రాయండి.

మీరేం చేయబోతున్నారో మాకు చెప్పండి.

మేమందరమూ ఎదురు చూస్తున్నాము.

మేం....అనగా
'పిల్లల ప్రపంచం'

---

## పెద్దలమాట

'మనిషి ఈ లోకంలోకి అనంతమైన స్వేచ్ఛకోసం, సృజనాత్మక కృషి కోసం, ఆనందం పొందడం కోసం వచ్చాడు.

## 21వ శతాబ్దంలో....2010వ సంవత్సరంలో మీరేం చేయాలనుకుంటున్నారు?

పిల్లలూ- మీ అందరికీ తెలుసు. మరి కొద్ది సంవత్సరాలలో మనందరం ఇరవై ఒకటో శతాబ్దంలోకి అడుగు పెట్టబోతున్నాం. సరిగ్గా 18 సంవత్సరాల తర్వాత జూలై 1వ తేదీన మీరు ఉదయం నిద్ర లేస్తారు. ఆ తర్వాత....?

ఎలా ఉంటే బాగుంటుంది? మీరేం కావాలనుకుంటున్నారు? మీరేం చేయాలనుకుంటున్నారు?

వెంటనే కలాలు తీసుకోండి. రాసి పంపించండి.

రేపటి ప్రపంచాన్ని గురించి మీ ఊహల్ని పెద్దవాళ్ళకు విప్పి చెప్పడం

# సుభాష్ ముఖోపాధ్యాయకు 1991 జ్ఞానపీఠ బహుమతి

ప్రముఖ బెంగాలీ కవి, రచయిత, 73 సంవత్సరాల వయసుగల సుభాష్ ముఖోపాధ్యాయకు 1991 జ్ఞానపీఠ బహుమతి ఇచ్చారు. ఐదు దశాబ్దాల పాటు ఆయన కవిత్వం రాస్తూ వచ్చారు. తేలికైన, ప్రజల భాషలో ప్రజల జాతీయాలతో కూడిన ఆయన కవితలు 17 సంపుటాలుగా విడుదలయ్యాయి. 1940 లో "కాల్బ లం" (పదాతిక్) అన్న మొదటి కవితా సంకలనం ద్వారా ఆయన సాహిత్యరంగంలో ప్రవేశించారు. చిట్టచివరి కవితా సంకలనం 1989 లో వచ్చిన "జా రే కాగజేర్ నౌకా!" (కాగితపు పడవా! నువ్వు సాగిపో).

1930 లలో ఆయన కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా, ట్రేడ్ యూనియన్ రంగంలో కార్యకర్తగా కృషిచేశారు. తన కవితా వ్యాసంగాన్ని ఫాసిస్టు వ్యతిరేక కవితలతో ప్రారంభించారు. చైనాపై జపాన్‌వారి బాంబుదాడి, సెయింట్ పీటర్స్ బర్గ్ (లెనిన్‌గ్రాడ్) యుద్ధం, ఇండియాలో నాజీ వ్యతిరేక ఉద్యమం, శ్రామికవర్గ సమస్యలు నేపథ్యంగా ఆయన కవితలు రచించారు.

1947 తర్వాత ఆయన ప్రచురించిన మొదటి కవితా సంకలనం 'అగ్నికణ్' 1947 లో జరిగిన అధికార మార్పిడి, శ్రామిక వర్గాలను నిర్లక్ష్యం చేసిందని అభి ప్రాయపడ్డారు. తెలంగాణలో, పశ్చిమ బెంగాల్లోని కాక ద్వీపంలో మిలిటెంట్ తిరుగుబాట్లు వచ్చిన సందర్భంగా కమ్యూనిస్టుపార్టీపై నిషేధం విధించారు. పలువురు సభ్యులు అజ్ఞాతంలోకీ, మరి కొందరు డిటెన్యూలుగా జైళ్ళలోకీ వెళ్ళారు. ఆ సందర్భంగా సుభాష్ ముఖోపాధ్యాయ 2 1/2 సంవత్సరాలు జైల్లో వున్నారు.

సుభాష్ ముఖోపాధ్యాయ ప్రస్తుతం బంగ్లాదేశ్‌లోవున్న రాజ్‌షాహి జిల్లా లోని నవగాంలో 1919లో జన్మించారు. 12 ఏళ్ళ వయసులోనే స్వదేశీ ఉద్య మంలో పాల్గొన్నారు. 1930లో సహాయనిరాకరణ ఉద్యమ కాలంలో ఆయన కల కత్తా వచ్చారు. ఆ తర్వాత భారత విద్యార్థి సమాఖ్యలో పని చేశారు. ప్రముఖ వామ పక్ష కవి సమరసేన్‌తో పరిచయం ఏర్పడిన తర్వాత 'ఇకపై' అనే ప్రసిద్ధగేయం రాశారు.

1940 లో కమ్యూనిస్టు పార్టీలో చేరిన సుభాష్‌కు 1942 లో పూర్తిస్థాయి సభ్యత్వం లభించింది. 1950 లో జైలు నుంచి విడుదలైన తర్వాత పార్టీ నిధుల కోసంరాసిన ఆయన కవిత"అగ్నికణ్"గా ప్రచురించారు. 1951లో గీతను వివాహం చేసుకున్నారు.

1950 తర్వాత రాసిన 'ఘా తీరే పేగార్' అనే గ్రంథంలో ఆయన మార్క్సిస్టు నాయకులను విమర్శించారు. పార్టీ ఈ గ్రంథాన్ని ఉపసంహరించు కొమ్మని కోరినా దానికి నిరాకరించారు. క్రమంగా ఆయన పార్టీకి దూరమై కాంగ్రెసును సమర్థించడం ప్రారంభించారు.

సుభాష్ ముఖోపాధ్యాయ గత 50 ఏళ్ళుగా రాసిన కవిత్వం బెంగాల్ ప్రజల రాజకీయ సామాజిక చరిత్రకు దర్పణం. ఆయన కవితలు సగటు పాఠకునకు సులభంగా అర్థమవుతాయి. ఆయన మొట్టమొదటి కవిత దక్షిణ కలకత్తాలోని చాకిరేవులో గుడ్డలు వుతికే చాకలి వారి మీద రాశారు. సుభాష్ కవితా వస్తువు కల కత్తాలోని సామాన్య ప్రజల జీవితం. కిక్కిరిసిన బస్సులు, పొంగిపొరలే డ్రైనేజీ, మోగని టెలిఫోన్లు మొదలగునవి ఆయన కవితావస్తువులు.

## శంకర్ గుహ నియోగిపై డాక్యుమెంటరీ- 'లాల్‌హరా లహరే కా'

భిలాయ్ ఉక్కు ఫ్యాక్టరీ ప్రాంతంలో 40 నుంచి 60 వేల మంది గని కార్మి కులను, శ్రామికులను సంఘటితం చేసిన ప్రముఖ కార్మిక నాయకుడు శంకర్ గుహ నియోగిపై కక్షకట్టి, పారిశ్రామిక వేత్తలు కిరాయి గూండాలచేత ఆయన్ను హత్య చేయించిన సంగతి ప్రజాసాహితి పాఠకులకు తెలుసు. ఈయన ట్రేడ్ యూనియన్ పేరు 'లాల్‌హరా'. తాము నిర్వహించిన 13 నెలల ఆందోళన కార్యక్రమాన్ని వీడియో చిత్రంగా తీయాలను కున్నాడు నియోగి.

ఢిల్లీలోని యువనిర్మాత అమర్ కన్వర్‌ని సహాయం అడిగాడు. అయితే ఈ ప్రాజెక్టుప్రారంభించేలోగానియోగిహత్యకుగురయ్యాడు. భిలాయ్‌లోఆందోళనఇప్పుడు నియోగి హంతకులను అరెస్టు చేయాలని సాగుతోంది. నియోగికి నివాళిగా అమర్ కన్వర్ వీడియో చిత్రాన్ని నిర్మిస్తున్నాడు. హత్యానంతర సంఘటనలకు ఎక్కువ ప్రాధాన్యత నిస్తూ తీసే ఈ చిత్రం భిలాయ్ ఆందోళనను మరింత ఉధృతం చేయ డానికి అక్కడి కార్మిక సంఘానికి ఒక ఆయుధంగా ఉపయోగ పడుతుంది.

నియోగి అంతిమ యాత్ర ఈ చిత్రంలో ప్రేక్షకులందర్నీ కదిలించివేస్తుంది. నియోగి ముఖంపై కెమేరాను ఫోకస్ చేస్తూ, ఆయన గతంలో ఇచ్చిన ఉపన్యాసం వినబడేట్లు చేసారు. నియోగితోపాటు పని చేసిన కార్మిక నాయకులు, సహచరులతో ముఖాముఖీ వుంటుంది. నియోగి చేసిన వైవిధ్య పూరితమైన ఆందోళనలు, నిర్మాణ కార్యక్రమాలు మొదలైన వివరాలు ఈ వీడియో చిత్రంలో పొందుపరిచారు.

చదవండి! చదివించండి!

# ఎక్సరే దశాబ్ది ఉత్సవ ప్రత్యేక సంచిక

డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ జ్ఞానానందకవి, శ్రీ మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, డా॥ బోయిభీమన్న, శ్రీ సోమసుందర్, డా॥ చేకూరి రామారావు, శ్రీ దర్భశయనం శ్రీనివాసాచార్య, శ్రీ మేడిశెట్టి తిరుమలకుమార్, శ్రీమతి కొలకలూరి స్వరూపరాణి, శ్రీ యన్. వెంకట్రావు గార్ల అక్షర ఆశీస్సులతో....

★ వరవరరావు, ★ కె. శివారెడ్డి, ★ పాపినేని శివశంకర్, ★ దర్భశయనం శ్రీనివాసాచార్య, ★ అద్దేపల్లి రామమోహనరావు, ★ కందుకూరి శ్రీరాములు, ★ కాకరాల ★ చందు సుబ్బారావు, ★ ఉపద్రష్టసాయి, ★ సాధనాల వేంకటస్వామి నాయుడు, ★ వాడ్రేవు రమాదేవి, ★ ఆసు రాజేంద్ర ★ నిఖిలేశ్వర్, ★ కాళోజీ, ★ అఫ్సర్, ★ హరిచంద్ర శేఖర్, ★ ప్రసేన్, ★ మందరపు హైమవతి, ★ యస్. మజీద్, ★ కొండముది శ్రీరామచంద్రమూర్తి, ★ ఆశారాజు, ★ ఎండ్లూరి సుధాకర్ గార్ల కవితలతో ...

★ సోమసుందర్, ★ మేడిశెట్టి తిరుమల కుమార్ ★ మానేపల్లి ★ డా॥ దేవరాజు మహారాజు ★ గూడ శ్రీరాములు ★ డా॥ ఎస్వీ ★ పురాణం సుబ్రహ్మణ్యశర్మ గార్ల సాహిత్య వ్యాసాలతో....

★ పిలకా గణపతి శాస్త్రి ★ దివాకర్ బాబు ★ కర్రా కార్తికేయశర్మ ★ ఉమ్మిడిశెట్టి నాగేశ్వరరావు, ★ బొల్లిముంత వెంకట రమణారావు, ★ చిట్టూరి ఉషారాణిగార్ల మినీ కవితలతో....

**వెలువడింది !**

వెల : రూ. 25/-

ప్రతులకు : EDITOR, X-RAY, D'PURAM, MADRAS-93.

# చైతన్య వాహిని

★ ఏప్రియల్ 9, 10, 11 తేదీలలో విజయవాడలో తమ సమస్యలపై ఆందోళన చేస్తున్న పాపులర్ షూ మార్ట్ కార్మికులుకి శిక్షణఇచ్చి వారిచేతనే 'థియేటర్ బై ది పీపుల్' పద్ధతిలో "ప్రాప్రాపేప్రేంఫం-చెప్పుల కంపెనీ" వీధినాటకం నేర్పగా, 11 వ తేదీన 'న్యూఇండియా' హోటల్ సెంటర్‌లోను, 12వ తేదీన వారి నిరాహార దీక్ష శిబిరం ముందు, మే 5 న లెనిన్ సెంటర్‌లో జరిగిన బహిరంగ సభలోను ప్రదర్శించారు.

★ ఏప్రియల్ 17 వ తేదీన విజయవాడ, నిడమానూరులో శిక్షణా శిబిరం సందర్భంగా "సామ్రాజ్యవాద సంస్కృతి-యువతరంపై విష ప్రభావం"అన్న అంశంపై జనసాహితి కార్యవర్గ సభ్యుడు ఉదయ్ క్లాసు చెప్పారు.

★ ఏప్రియల్ 19, 20, 21 నందిగామ తాలూకా రుద్రవరంలో ఎన్.వై.ఓ, డి.ఎస్.ఓ ల నిర్వహణలో జరిగిన పాటల శిక్షణా శిబిరానికి శిక్షకులుగా ఉదయ్, అనూరాధలు పాల్గొన్నారు. 21 వ తేదీన జరిగిన బహిరంగ సభలో "గారడీ", "బయలుదేరవే పిల్లా" డ్యాన్సులు ప్రదర్శించారు.

మేడే కార్యక్రమాల్లో........

★ బందరు-కరగ్రహారంలో మేడే సందర్భంగా స్థూపావిష్కరణలోనూ, బందరు జెడ్.పి. సెంటర్‌లోని ఖోగాదుల రామారావు స్థూపం వద్ద జెండా ఆవిష్కరణల వద్ద, రిక్షా కార్మికుల మేడే కార్యక్రమాలలో జనం పాటలు పాడారు. ఉపన్యాసాలు ఇచ్చారు.

★ మే, 2వ తేదీన విజయవాడ, ఆటోనగర్‌లో భారత మోటార్ పార్సిల్ సర్వీస్ (బి.ఎం.పి.ఎస్.) వర్కర్స్ వారి బహిరంగసభలో....

★ మే 3న పొన్నెకల్లులో....

★ మే 6న శింగరాయకొండలో....

★ మే 7న విజయవాడ, రామవరప్పాడు ఎన్‌వైఓ వారి అల్లూరి సీతారామరాజు వర్థంతి బహిరంగ సభలో....

★ మే 8న బాపట్ల తాలూకా కర్లపాలెంలో డి.ఎస్.ఓ-ఎన్.వై.ఓ ల అల్లూరి సీతారామరాజు వర్ధంతి బహిరంగసభలో....

★ మే 9 న వెంకటగిరి (నెల్లూరుజిల్లా)లో మేడే బహిరంగసభలో....

★ మే 10 న ఒంగోలు వద్ద పేర్నమిట్టలోని సుబ్బయ్య రెసిడెన్షియల్ స్కూల్ గార్షికోత్సవంలో....

కృష్ణాజిల్లా కళాకారులచే "అప్పుల భారతం" ప్రదర్శనలు ఇచ్చారు. సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారాందోళనలో....

★ నాగాయలంక, చల్లపల్లి నవభారత యువజన సంఘం శాఖల ఆధ్వర్యంలో సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రచారాందోళనలో భాగంగా ఆ ప్రాంతాలలో బహిరంగ సభలు. 'అప్పుల భారతం' ప్రదర్శనలు విస్తృతంగా ఇచ్చారు. మే 16 న నాగాయలంక, కన్యకాపరమేశ్వరి ఆలయ ప్రాంగణంలోను, మే 18 న తాడేపల్లిలోను, మే 20 న ఘంటశాల పాలెం - హరిజనవాడలో, మే 21 న ఘంటశాల పాలెం ఊళ్ళో, మే 22 న చిట్టూర్పులో, మే 23 న వక్కలగడ్డలో కా॥ గరికపాటి రాజారావు వేదికపై బహిరంగసభ తర్వాత, 'అప్పులభారతం' ప్రదర్శనలు ఇచ్చారు. ఘంటశాలపాలెం ఊళ్ళో కొందరు కులతత్వ శక్తులు స్టేజీపైకి దూసుకువచ్చి, అలజడి సృష్టించి, లైట్లు, మైకులు పగులగొట్టినా, చిట్టూర్పులో వరకట్న సమస్యపై పాటపాడుతుంటే, ఆ ఊరిలోని ఉమాలక్ష్మి అనే మహిళను వేధించి హత్యచేసినవారి మనుషులు గొడవచేసి, మైకు కనెక్షన్‌లు పీకి వేసినా మళ్ళీ ఏర్పాట్లు చేసుకుని "అప్పుల భారతం" ప్రదర్శనలు పూర్తి చేశారు.

★ మే 29 న కోడూరులో ఆం.ప్ర.రైతుకూలీ సంఘం వారి బహిరంగసభలోను సముద్రతీర బంజరు భూములు స్థానిక పేదలకే దక్కాలని డిమాండుచేస్తూ జరిగిన సదస్సుకి ప్రచారం చేస్తూ సముద్రతీర 28 గ్రామాలలో జనంపాటలు పాడారు.... బహిరంగసభలో "అప్పుల భారతం" ప్రదర్శన వేశారు.

★ 29-4-92 తేదీ సాయంత్రం 6 గంటలకు ఒంగోలు మహిళా మండలి ఆవరణలో జనసాహితి ఒంగోలుశాఖ, పట్టణ హేతువాద సంఘాల ఆధ్వర్యంలో-మే 2 నుండి కేరళలో ఖగోళ పరిశోధనా అభివృద్ధి కేంద్రం వారు నిర్వహించబోతున్న 'పుత్రకామేష్టి' యాగాన్ని నిరశిస్తూ, ఒక బహిరంగ సభ జరిగింది. జనసాహితి తరపున రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు, పి. గోవిందరావు, హేతువాద సంఘం తరపున, ఆ సంఘ అధ్యక్షుడు ఈశ్వర ప్రభు ఉపన్యసించారు. పాత్రికేయుడు, ఐ.వి. సుబ్బారావు అధ్యక్షత వహించారు: సభలో పుత్రకామేష్టి యజ్ఞాన్ని నిషేధించమని కేరళ ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం, లౌకికరాజ్య స్వభావాన్ని దెబ్బతీసే విధంగానూ మత ఛాందసత్వాన్ని పెంచి పోషించే విధంగాను ప్రభుత్వ టీవీలో, రేడియోల్లో ప్రసారమవుతున్న సీరియల్స్‌నీ, కార్యక్రమాల్నీ నిలిపి వేయవలసిందిగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ మరొక తీర్మానమూ ఆమోదింపబడింది.

★ 30-5-92 రాడికల్స్ కోసం గాలింపు పేరుతో ఈరోజున అర్ధరాత్రి ప్రకాశం జిల్లా పెళ్ళూరు గ్రామం మీద సాయుధులైన 25 పోలీసులూ, 4 ఎస్.ఐలూ దాడిచేసి ప్రజల్ని బెదిరించి, భయభ్రాంతుల్ని సృష్టించారు. ఇద్దరు జనసాహితి సభ్యుల్నీ ఒక ఓపిడిఆర్ సానుభూతి పరుడ్నీ, మరొక యువకుణ్ణీ అరెస్టుచేసి తమతో తీసుకు పోయారు. పోలీసుల చర్యకీ, అక్రమ అరెస్టులకీ గ్రామ ప్రజల్లో తీవ్రమయిన నిరసన వ్యక్తమయింది. జనసాహితి, ఓపిడిఆర్ నాయకులు వెళ్ళి పోలీసులకు ఎంత నచ్చజెప్పినా, అరెస్టు చేసినవారినివిడుదలచేయలేదు. అంతలో500 మందికిపైగా ప్రజలు ఈ అక్రమ అరెస్టులను ఖండిస్తూ నిరసన ప్రదర్శన చేశారు. నినాదాలు ఇచ్చారు. జనసాహితి, ఒపిడిఆర్ నాయకులు కలక్టరునీ, జాయింట్ కలెక్టరుని కలిసి అక్రమంగా అరెస్టు చేసినవారిని వెంటనే విడుదల చేయమని డిమాండ్‌చేస్తూ మెమో రాండం ఇచ్చారు. ఫలితంగా అరెస్టు చేయబడిన జనసాహితి సభ్యులు హనుమంత రావునూ, బ్రహ్మయ్యనూ, ఓపిడిఆర్ సానుభూతి పరుణ్ణీ మరొక యువకుణ్ణీ ఒకటో తేదీ మధ్యాహ్నం పోలీసులు విడుదల చేశారు. ఈ కార్యక్రమంలో జన సాహితి, ఓపిడిఆర్ తోపాటు ఏపిసిఎల్‌సి, ఆంధ్రప్రదేశ్ రైతుకూలీ సంఘం, పిడిఎస్‌యు, డిఎస్ఓ, ప్రగతిశీల మహిళా సంఘం (స్త్రీ విముక్తి), పివైఎల్, వర్కర్స్ సాలిడారిటీ మొదలగు సంఘాలు కూడా పాల్గొన్నాయి.

★ 2-5-92వ తేదీన విజయవాడ అరుల్‌నగర్‌లో మేడే సందర్భంగా 'అప్పుల. భారతం' ప్రదర్శన జనసాహితి కళాకారులచేత.

★ 3-5-92 పొన్నెకల్లులో మేడే సందర్భంగా జనసాహితి కళాకారులు 'అప్పుల భారతం' ప్రదర్శించారు.

★ 6-5-92 సింగరాయకొండలో మేడే బహిరంగ సభ అనంతరం జనసాహితి కళాకారులచే 'అప్పుల భారతం' ప్రదర్శన.

★ 7-5-92 (విజయవాడ) రామవరప్పాడులో అల్లూరి సీతారామరాజు వర్ధంతి సందర్భంగా ఏర్పడిన బహిరంగసభలో జనసాహితి కార్యదర్శి దివికుమార్ ప్రసం గించారు. అనంతరం జనసాహితి కళాకారులు 'అప్పుల భారతం' ప్రదర్శించారు.

★ 8.5.92కర్లపాలెం (గుంటూరుజిల్లాలో) డి.ఎస్.ఓ విద్యార్థిసంస్థ ఆధ్వర్యంలో అల్లూరి వర్ధంతికి తొలుత పోలీసులు అనుమతియిచ్చి, చివరినిమిషంలో రద్దుచేశారు. మరొక మార్గంలేక జనసాహితి కళాకారులు 'అప్పుల భారతం' ప్రదర్శనను వేదిక మీదగాక, రోడ్డుమీద వేశారు. ప్రజలు ఎంతో ఉత్కంఠతో ప్రదర్శనను తిలకిం చారు.

---


**Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANASAHITI [Sahitya Samasta] (A.P.). at Chaitanya Printers Vijayawada-2. for Co-operative Press, Vijayawada**

**Working Editor ; NIRMALANANDA**

క వి త

# ఎలర్జి

జనారణ్యంలో జరుగుతున్న
క్రూర హింసను నిర్జించేందుకు
అడవి దావానలాన్ని తలపాగాలా
చుట్టుకొంది!
తనలో నదీజలాల శాతం క్షీణించి
స్వేద రుధిరాల పాళ్ళు అధికమై
కడలి బడబాగ్నిని ఒళ్ళంతా
ఎర్రగా పులుముకుంటోంది!
అటు చూడు!
సూర్యుడి కోపంలా నిప్పులు చెరిగే గ్రీష్మం!
సూర్యుడంటే అవిశ్రాంతశ్రామికుడు
సూర్యుడంటే—
తాను బూడిదవుతూ
జగతికి జీవం పోస్తున్న త్యాగధనుడు
సూర్యుడి ఉదయం అరుణం
ఇక్కడి అస్తమయం
మరో చోట అరుణోదయం!
మిస్టర్ పోలీస్!
ఎరుపంటే నీకు ఎలర్జీ కదా!
కమాన్! అరెస్ట్ దెమ్!

— అణుకుమార్

[ప్రకాశం జిల్లా పెళ్ళూరులో జనసాహితి కళాకారుల అక్రమ అరెస్టుకు స్పందించి]

కవిత :

# సాక్ష్యం

—దర్భశయనం శ్రీనివాసాచార్య

నడక నిస్తున్న నేల సాక్షిగా
ఊరును
చూసింది చూసినట్లుగా చెబుతాను
నిషేధించుకుని చెప్పను

*   *

ఊరు ఆగిపోయింది / మాట పడి పోయింది
చూపానడం లేదు / మన సోయిలో లేదు
ఉన్నదంటే ఉన్నదంతే!
చేతుల్లేని వాడొచ్చి
నాడి చూసి / 'సబ్ ఠీక్ హై' అన్నాడు
ఎవడో కాసిన్ని / నీళ్ళు నోట్లో పోయబోతే
వాణ్ణీ నీళ్ళనూ లాక్కెళ్ళాడు
మరెవడో!
నలుగురేడ్వబోతే / 'శ్రేయోభిలాషులొ'చ్చి
విశ్రాంతికని తీసుకెళ్ళారు
కారు దిగి ఆయనొకాయన / మహామహాయన హామీగా
ఊరులేందే దేశం లేదని / జబ్బేమీ చేయదని
టోపీ సవరించుకుని / పునరుద్ఘాటించారు
ఆసుపత్రి లేదు / అంబులెన్సు లేదు
ఊరుకు సేద లేదు

*

ఈ నేల చరిత్ర సాక్షిగా
పోరు
ఊరుకు కొత్త కాదని చెబుతాను
ఊరు మాత్రం చావదు!